REGD. No. M. 4793

# గృహలక్ష్మి

15th Sept 1949

## దసరా సంచిక



VOL. 18

# GRIHALAKSHMI

No. 9

PRICE AS. 6.



దసరాసంచిక

# గృహలక్ష్మి

స్త్రీల సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు:
డాక్టరు. కే. యన్. కేసరి

# GRIHALAKSHMI
LADIES' TELUGU MONTHLY

సెప్టెంబరు—1949



సంపుటము ౧౮] [సంచిక ౬




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా **రు.4-8-0.** అర్థసంవత్సరపు చందా **రు.2-8-0.** అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువదైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# గృహలక్ష్మి ఏజంట్లు:



గుంటూరు: వెల్‌కం & కో.
కర్నూలు: బాలసరస్వతి బుక్ డిపో.
బెజవాడ: మాడరన్ న్యూసు ఏజన్సి.
అనంతపురము: వై. సాంబయ్య.
భద్రాచలం: టి. వి. జి. ఆర్. మూర్తి.
దొమ్మగూడెం: సి. హెచ్. బాపనయ్య.
నర్సాపూరు: వై. సుందరరామయ్య.
కావలి: జి. రంగయ్య.
మారుటేరు: వి. వి. సుబ్బారావు.
పిఠాపురము: యం. సూరరాజు.
మచిలీపట్నము: టి. బి. నారాయణశింగ్.
ఏలూరు: నేషనలు బుక్కుడిపో.
రాజమండ్రి: నేషనల్ ఏజన్సీస్.
బరంపురం : కె.వి.రంగారావు.
విశాఖపట్నం: సిటీ. న్యూస్ ఏజన్సి.
కనిగిరి: కె. యస్. శాస్త్రి
పర్లాకిమిడి: బి. యన్. మూర్తి.
బళ్ళారి: యస్. గురునాథ్
నెల్లూరు. ఎ. వి. నారాయణయ్య.
విజయనగరము : పి. నారాయణప్పడు.
కడప : వై. వి. సుబ్బారావు.
గుత్తి : వి. హనుమంతాచార్.
భీమవరం: యన్. సూర్యనారాయణ.

పొన్నూరు: చౌదరి ఖాదీస్టోర్సు
మదనపల్లి: యన్. రాధాకృష్ణయ్య
అంబాజిపేట: పి. రామమూర్తి.
చికాకోలు: బి. యన్. మూర్తి.
ఖర్గపూరు. య స్. వి. నాయుడు.
పార్వతిపురము: ఎ. వి. వి. యన్. మూర్తి.
తిమ్మనచర్ల: రాయలసీమ న్యూసుమార్టు.
వాల్తేరు: సిటి న్యూస్ ఏజన్సి.
జగత్యాల: కాసం, శివరాజగుప్త & సన్సు.
రంగూన్: నేషనలుస్టోర్సు.
బాపట్ల: యల్. వి. మనోహరరావు.
జంషెడ్‌పూర్: యం. శ్రీరాములు.
తాడేపల్లిగూడెం: జి. సూర్యరావు.
మహబూబ్ నగర్ : ముత్యాలు & సన్సు.
హైదరాబాద్ : నవ్యాంధ్రా ఏజన్సీస్.
కదిరి: జి. సి. కోదండరామయ్య.
గోకవరం: వి. వి గోపాల్‌రావు.
పామర్రు: జి. లక్ష్మయ్య.
ఛత్రపురం : వి. వి. రంగాచారి
డోర్నకల్లు : కె. జె. జి. సుందరం.
చోడవరం : పి. విశ్వేశ్వరరావు.
తిరుపతి : ఆర్. చంచల్‌రావు
చీరాల. పి. సూర్యనారాయణ
పుత్తూరు : ఎ యస్. ఎ. అయ్యర్.
గణపవరం : ఆర్. సుబ్బారావు.
కొడవలూరు : జి. వీరరాఘవులు.
కూచిపూడి, జి, సీతారామయ్యా.

**హిగిన్‌బాతమ్ స్టాలులవద్ద దొరకును.**

 ఇతరచోట్లను ఏజంట్లు కావలయును; డిపాజిటుతో దరఖాస్తుపంపుకోనుడు.

# విషయ సూచిక




జయజయ గృహలక్ష్మి సఖి జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయ కల్యాణీ !

---

# దసరా

దసరా భారతదేశపు పండుగలలోకెల్లా ఉత్తమోత్తమమైన పండుగ. ఆబాల గోపాలం స్త్రీపురుషులంతా ఉత్సవములలో మునిగి తేలే పండుగ.

ఈపండుగలలో సృష్టిస్థితిలయ కారణభూతమైన చిచ్ఛక్తిని ఆదిశక్తిని, పరాశక్తిని జగద్ధాత్రిని మాతృస్వరూపిణిగా ఆరాధిస్తారు. ఆమెను లక్ష్మి, పార్వతి, సరస్వతి అనే భేదంలేకుండా భద్రకాళి, దుర్గ, లక్ష్మి, సరస్వతి ఇత్యాది అన్నిపేర్లా పిలుస్తూ కొలుస్తారు.

ఇది ఒక్క హిందుమతానికే చెందిన తత్వం అనడానికి వీలులేదు. దాదాపు అన్ని మతములకు, మూలంలో మాతృస్వరూపిణి ప్రాణం పోసింది. క్రైస్తవుల పవిత్రత్రయంలో పవిత్రమాతృమూర్తి మేరియమ్మ యొకవిభూతి. బౌద్ధమతానికీ మూలంలో ఒకస్త్రీమూర్తి ఉన్నది. అట్లాగే మతాలన్నిటినీ తరిచి చూస్తే ఆమెచల్లనిమూర్తి దృగ్గోచర మవుతుంది.

మతప్రవక్తలందరున్నూ మాతృమూర్తిని సేవించినవారే. ఆదిశంకరులు సన్యాసాశ్రమ విధులను ఒకవంకకు త్రోసి మాతృఋణం తీర్చుకున్నారు. దాక్షిణాత్య వైష్ణవ మతంలో ఆండాళ్ దేవి కగ్రస్థానమిచ్చారు. ఔత్తరాహుల వైష్ణవమతంలో రాధామాధవులు విడదీయరానిజంట. వైశ్యులు తమకు కన్యకాపరమేశ్వరి నారాధ్యదేవతగా వించుకున్నారు. ఆధునికులలో శ్రీరామకృష్ణ పరమహంస కాళికామూర్తి వరప్రసాదము గన్నవాడు. వివేకానందుడు జగద్ధాత్రిని గురుపత్ని శ్రీశారదాదేవి యందు గాంచినాడు. అరవిందాశ్రమమున మాతసర్వాధికారిణి. తిరువణ్ణామలై ఋషిపుంగవులు మాతృభూతేశ్వరిని లింగాకారమున నారాధించుచున్నారు. లక్షల

కొలది శిష్య వర్గము తనయందలి భక్తివిశ్వాసములతో తరించుచున్నామని తృప్తులై కొలుచుచున్నారు; కానిఆమహర్షి తన తపశ్శక్తినిభరింప మాతృభూతేశ్వరి లింగమే అర్హమని తలంచి అందు నిక్షేపించుచున్నారని వారువినయముతో విశ్వసించుచున్నారట. సామాన్య వ్యక్తిగా ఆంధ్రదేశమున నుండి అరవదేశమునకువెళ్లి కుర్తాళమునందు గొప్ప పీఠమును స్థాపించి అసంఖ్యాక శిష్యవర్గముచే కొల్పించుకొన్న శ్రీమౌనానంద సరస్వతీ స్వాములవారు "అమ్మణి" కృపవల్ల ఆమహాత్వము సంపాదించిరట.

మన రాజకీయాందోళనమును 'వందేమాతరం' మంత్రముతో ప్రారంభమైనది. 36 సం॥ లుగా ఆంధ్రోద్యమము సాగించుచున్న ఆంధ్రులకు ఆంధ్రమాత ఆరాధ్యమైనది.

వేయేల! భారతీయ సంస్కృతియందు చెట్టు, పుట్ట, గుట్ట, నది, కొలను, పువ్వు, బూది సర్వమూ స్త్రీస్వరూపములే. చదువు సరస్వతి; ధనము, ధాన్యము, భూమి, రాజ్యము, కళ, కావ్యము, ధైర్యము, సాహసము, ఔదార్యము, సకలైశ్వర్యములు, సర్వ విద్యలు, సమస్తవిభూతులు స్త్రీ పరముగనే అన్వయ మగుచున్నవి. కడకుముక్తియు కాంతయేనట!

ఏల ఇట్లు స్త్రీ మాతృస్వరూపిణిగా సకల జనసంసేవ్య, సర్వజనారాధ్యమైనది? స్త్రీలేనిదే, మాతృమూర్తి అనుగ్రహించనిదే సృష్టిలేదు. సృష్టింపబడిన దానికి స్త్రీగాని మెళుకువతో స్థితి కల్పించ జాలదు. స్త్రీపురుష సమన్వితమై పరిభ్రమించు సంసార చక్రపు తీక్ష్ణమగు అంచులరాపిడినగాని సకలవస్తుజాలములు వినియోగమై లయ మందజాలవు. సృష్టిస్థితి లయములు ఒండొంటిని ఒరసికొనుచు నడచినగాని లోకమునకు శోభ లేదు; కావున స్త్రీమూర్తి నారాధించుతత్వము ఉత్తమోత్తమ మైనది.

ఈ ఆరాధనము మూఢభక్తితో గావించినను - మనోవికాసముదయించి - అభీష్టములు నెరవేరుచున్నవి. ఇక జ్ఞానవైరాగ్యముల నలవరచుకొని - ఆ ఆరాధనము నడిపితే లోక కళ్యాణమేకదా!

ఆ దేవీమూర్తిని - భారతమాత రూపమున ననేకవిధముల సేవించి స్వాతంత్ర్యము పొందినాము. ఆజగద్ధాత్రి నిక శారదా :మూర్తిగా, లక్ష్మీస్వరూపిణిగా, పరాశక్తిగా సేవించి వచ్చిన స్వాతంత్ర్యమును సంరక్షించుకోవలెను; ఫలప్రదము గావించుకోవలెను. లోకం పోకడలకు వంకలుదిద్ది ప్రపంచశాంతి నెలకొల్పవలెను. ఇందును స్త్రీ పురుషులకు సమాన బాధ్యత కలదు. పురుషునితోపాటు అన్నిరంగముల ఆమెకొంగుబిగించి కృషిచేస్తేనేగాని చదువులుసాగవు; ఆహారసమస్య తీరదు; వంటినిండా గుడ్డ అమరదు; ఇల్లువాకిళ్లు ఏర్పడవు; సకల వస్తుజాలము సృష్టికాదు. కావ్యము లుద్భవించవు; కళలు పెంపొందవు. ఇంతేల? గృహలక్ష్మీ! నీవు కార్యకారిణివి కాకున్నచో నీసంతానము లోకమున తలయెత్తుకొని తిరుగ జాలదు.

కాన నీదసరా మహోత్సవములలో నారాధింపబడు జగదంబ గృహలక్ష్ముల కట్టి శక్తి యుక్తులనొసంగుగాక.

# శ్రీ కన్యకా పరమేశ్వరీ స్తోత్రములు



శ్రీ చెన్నపురియందు సకలాత్మసాక్షివై, శ్రీపరంజ్యోతివై వెలిగినావు
శ్రీ బ్రహ్మసృష్టిలో చిద్రూపమును దాల్చి, శ్రీమహాశక్తివై చేరినావు
శ్రీ మనువేళలో శ్రీగిరిపుత్రివై, శ్రీస్వరూపంబున వెలిగినావు
శ్రీ మహాకలియందు శ్రీవాసవాంబవై, శ్రీమించుశుభములం జెందినావు

భళిర నీదుమహామంత్ర బలమెరుంగ, గమలజునికైన దరమె శ్రీ కన్యకాంబ
భక్తులను బ్రోవ దేవతల్ ప్రస్తుతింప నవనిజన్మంబు గాంచితివో యమ్మ నీవు.

కలియుగంబుననీవు ఘనముగా నీపురి కన్యకాంబికవంచు కరుణతోడ
విప్రోత్తములం జేయు వేదోక్తవిధులచే, భవ్యపూజాదులు బడసినావు
అసురుల శిక్షింప నమరుల రక్షింప, బద్ధదీక్షుల చేత ప్రబలినావు
నీకటాక్షంబుచే నిఖిలలోకంబులు, బహుశుభసంగతి బడయగలిగె

అంబ! నీమాయ బ్రహ్మకు నరయదరమె సకలసద్గుణమణిజాల సత్యశీల
నీకు వందనములు జేతు నియతితోడ గరుణరక్షింపుమోయమ్మ కన్యకాంబ.

కడువేడ్కతో నొక కలశంబు బెట్టిన కలశాననుందువు కంబుకంఠి
పొలుపొందనీకొక్క భవనంబుగావింప భవనాననుందువు భోజనయన
బంగారుప్రతిమగా వడిరతి బోసిన, బహుమోదము నందుచుందు తల్లి
చెలువొందగానీకు జ్యోతిగావించిన, జ్యోతిలో వెలిగేటి సుందరాంగి

అమ్మ నీవంటి వేల్పులిమ్మహిని గలరె, దనుజసంహారి దుష్టదవానలంబ
చెన్నపురియందు నెలకొన్న తల్లినీవు సకలసురమునివినుతాంబ కన్యకాంబ.

అంబబంగారు సరిగ చీరధరించి, కుంకుమ గంధంబు పొంకపరిచి
వరసగంటలు నూలు వడ్డాణమమరించి, రవలకమ్మలు నీవు పదిలపరిచి
అణిముత్యపు పేరు లందంబుగా దాల్చి, సొగసైన వజ్రాలజోడు దొడిగి
మల్లెపూల్ల దండ సొగసుకొప్పున నుంచి, పొలుపైన బంగారు బొట్టుపెట్టి

అభయహస్తంబు కరుణాకటాక్షమమర, వెలసితివి గదమ్మ భక్తులపాలికొమ్మ
చెన్నపురియందు నెలకొన్న తల్లినీవు సకలసురముని వినుతాంబ కన్యకాంబ.

మార్కొన్న వీరుల మదమడంపగనీవె, దేవాదిదేవుల దిక్కునీవె
దాటుశూన్యంబులు దాకకుండగనీవె, మటుమాయవిద్యల మట్టునీవె
కంటకులను బట్టి గాసిబెట్టగనీవె, వంటిగానుండిన జంటనీవె
పెనుగొండపురి జన్మమైన కన్యకనీవె, వడిమమ్ము రక్షించు తల్లినీవె

నీదుశౌర్యంబు నిరతంబు నిశ్చయంబు, నిన్ను వర్ణింప నెవ్వరు నేర్తురమ్మ
చెన్నపురియందు నెలకొన్న తల్లినీవు, సకలసురముని వినుతాంబ కన్యకాంబ.

మహితభేరీఘోష పటుతరవాద్యంబు బ్రహ్మాండభాండంబు బగులజేయ
జయము వీక్షించిన శంఖధ్వనులు మ్రోయ బొంభోయటంచును భోరుకొల్ప

శూలంబు చేపట్టి చోద్యంబుగా ద్రిప్పి, కుపితజనులకెల్ల గుండెలదర
రోషంబుచేమించి, రొప్పునదల్చిన శత్రుసంఘంబెల్ల జగతిడుల్ల

శాకినీభూతభేతాళ సంఘములను, యక్షరాక్షస సంఘముల నగుడుపరచి
చెన్నపురియందు నెలకొన్నతల్లినీవు, సకలసురముని వినుతాంబ కన్యకాంబ.

దండంబునీకు బ్రహ్మాండభాండోదరి, దండంబునీకు నఖండజనని
దండంబునీకు మార్తాండ మండలవర్తి, దండంబునీకు నఖండతేజ
దండంబునీకు కోదండదీక్షాదక్ష, దండంబువందిత పుండరీక
దండంబునీకు యోకన్యకాంబమదంబ, దండంబునీకు మాదండితల్లి

మ్రొక్కెదను పెక్కుగల సింహంబునెక్కి, విహరించుభువన వర్ణితకునీకు
చెన్నపురియందు నెలకొన్నతల్లినీవు, సకలసురముని వినుతాంబ శ్రీకన్యకాంబ.

నంబూరు వీరరాఘవ్వలు శ్రేష్ఠి.





బ్రిటిష్ రాకుమారి ఎలిజబెత్,
ఆమెభర్త, ఎడింబరో ప్రభువు.
వారి కొమారుడు ఛార్లెస్
రాకుమారుడు. ఆరవజార్జికి
నేటికి ఈరాకుమారియే ప్రథమ
వారసురాలు.
ఇదియే ఈ తల్లితండ్రులు తమ
శిశువుతో తీయించుకున్న
మొదటి ఛాయాచిత్రము.



# దేశభక్తుని అస్తమయం

దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారు స్వాతంత్ర్యోత్సవ దినమున గుంటూరులో, స్వగృహంలో, కుమార్తెల సన్నిధానంలో అస్తమించారు. 84 సం॥ల వందు ; దేశసేవలో, సంఘసేవలో, స్వాతంత్ర్య రణరంగంలో ముగ్గపండి నైజంగానే రాలిపోయినాడు. అదీ స్వాతంత్ర్యోత్సవంనాడు సిద్ధించడంచేత ఆయనజన్మ సార్థకమైంది ; స్వాతంత్ర్యోత్సవమూ సార్థకమైంది.

పంతులు జీవితమంతా ప్రజాసేవ చరిత్రయే. గతశతాబ్దాంతంలోనే ఆయన కార్యక్రమం ప్రారంభమైంది. సంఘసంస్కరణం, లంచగొండితనం రూపుమాపడం, భాషాసేవ, పత్రికారచన, రాజకీయ ప్రచారము, ఆంధ్రోద్యమము, స్వాతంత్ర్యోద్యమము సత్యాగ్రహోద్యమము, పార్లమెంటరీ విధానము, అందులోను అపచారములు జరుగగా వాని నెదుర్కొనడం, ఈ విధంగా ఎత్తినఝండా దించకుండా ఈ దేశభక్తుడు తన ప్రజాహిత జీవయాత్ర 60 స॥లకుపైన నడిపాడు ; ఇతరులను నడిపించాడు.

ఏ ఉద్యమం నడిపినా ఉజ్జ్వలంగానే నడిపాడు ; ఉన్నతస్థాయిలోనే నడిపాడు. లంచగొండితనము నెదుర్కొన్నప్పుడు ఒక డిప్టీకలెక్టరుగారి ఆగ్రహానికి గురియై జైలులో నిర్బంధముకూడా అంగీకరించాడు ; కాని వెంటనే ఆయన వాదంనెగ్గింది ; విడుదలై కీర్తి వ్యాపించింది. సంఘసంస్కరణకూడా ఒక ఉద్యమమేనా అని ఈ నాటివారు పెదివివిరుస్తారేమో ! శూద్రులతో తైలపక్వపదార్థాలారగించడంకూడా దూష్యమైన ఆరోజులలో బిపిన చంద్రపాలువంటి దేశనాయకుని గౌరవార్థం మిత్రులతోకలిసి వారిసరసన తైలపక్వపదార్థముల విందారగించి సనాతనాచార పరాయణుల ఆగ్రహానికి గురిఅయినారు. అట్టి పంతులే 1923 లో కాకినాడ కాంగ్రెసు భోజనశాలలో ఆలీసోదరులిద్దరిమధ్య ధావళి మడి కట్టుకొని కూర్చుండి భోంచేశారు. వారిలో షౌకతాలీ భోజనమధ్యే పంతులుతొడ తట్టుతూ ముచ్చట చెప్పేవాడు ; మరిచిపోయి పంతులుగ్లాసులో మంచినీళ్లుకూడా తాగేశాడట. భోజనానంతరం ఉత్తరాపోశనపట్టను పంతులు మళ్లీ నీరు తెప్పించుకోవలసి వచ్చిందటకూడా. ఆ రోజులలో వితంతూద్వాహమున్నా విడ్డూరమే ; జిల్లాసంఘాధ్యక్షులుగా ఉండి చోడవరపు జగన్నాధరావు పంతులుగారి (వితంతు) వివాహానికి శుభలేఖ

లచ్చువేయించి సర్వసన్నాహాలుచేసి, వస్తామన్న వైదిక పౌరోహితులు రాక బహిష్క-
రింపగా నియోగి పౌరోహిత్యంతో వివాహం జరిపించేశారు.

రాజకీయప్రచారమున్నూ అలాంటిదే. ఆదినాళ్లలో గ్రామాలవెంటతిరిగి, ఉపన్యాసాలిచ్చి, కరపత్రాలుపంచిపెట్టి ప్రజలకు బోధించడం ఆంధ్రదేశంలో ప్రారంభించిన వారు వారు. నేటిగ్రామాలలో రాజకీయ చైతన్యం చూచినవారికి నాడుపంతులుగారు అల్లము, పసుపు పండించి ధనం చేకూర్చండని రైతులను, మరమగ్గాలువాడి హెచ్చుగా గుడ్డనేసి హెచ్చుకూలి సంపాదించడని నేతవాండ్రను, కలరా, మన్యజ్వరాలకు వైద్యశాస్త్రరీత్యా నివారణోపాయా లవలంబించండని జనసామాన్యాన్ని ప్రబోధించేవారని విన్నప్పుడు నవ యువతీ యువకులు నవ్వుతారేమో! అయితే అట్టి పంతులుగారే ముందుకు దుముకుచున్న పిన్నవారికన్నా ముందుకు, కాలంతోపాటు, దుమికారు. 1921లో సారాపాటలప్పుడు ఆంధ్ర దేశానికంతా మొదట అరెస్టయినారు. ఆ మాటవిని గాంధీ సంతోషాతిశయాన ఉబ్బి "వెంకటప్పయ్యను తుపాకిగుండేసి కొట్టేయలేదా?" అన్నారు; అంటే, అట్లయితే, తన ఉద్యమానికంత బలుపు అని ఆయన ఉద్దేశం. ఆయనే 1921-22 లో గుంటూరిలో పన్నుల నిరాకరణోద్యమం రుచిచూపారు. ఆయనే ఆంధ్రదేశంలో ఉప్పుసత్యాగ్రహానికి నియంత. ఆ పిదప సత్యాగ్రహాలలో శాసనోల్లంఘనములలోకూడా పాల్గొన్నారు. స్వాతంత్ర్యసిద్ధి కళ్లారాచూచారు. దేహంచాలించారు.

ఆ రోజుల్లో మద్రాసులో వెలువడుచుండిన శశిలేఖ, ఆంధ్రప్రకాశిక మొదలైనవి తప్ప రాజకీయముల చర్చించే తెలుగుపత్రికలు హెచ్చులేవు. 1901 లో కృష్ణాపత్రికను స్థాపించి, నూతన రాజకీయపదజాలమును తెలుగులో సృష్టించి ఆ పత్రిక నమోఘముగా ప్రథమంలో నడిపినకీర్తి ఆయనదే.

ఆంధ్రోద్యమునుచేబట్టి 5, 6 స॥లలో దానిని అఖిలభారత భాషాప్రయుక్త రాష్ట్రోద్యమంగా మార్చివేశారు. నేడు వివాదగ్రస్తమైన సరిహద్దు ప్రాంతాలకై అసలు రాష్ట్రమే వదులుకోబోతున్నారు మనపెద్దలు. ఆయన దూరదృష్టితో 1918 లోనే తమిళ రాష్ట్రంలోఉన్న చిత్తూరుజిల్లా ప్రాంతాలను ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీకి సాధించిపెట్టారు. సహాయనిరాకరణోద్యమంవచ్చి, ఆంధ్రరాష్ట్రాందోళన వెనుకబడకుంటే, నేడువివాదగ్రస్తమైన తెలుగు ప్రాంతాల నెన్నింటినో ఆయన రాబట్టేవారే. నాటికి నేటికి ఆంధ్రనాయకులు ఆ ఉద్యమంలో సాధించింది, ఒక్క చిత్తూరి జిల్లాయే

పూర్వశాసన సభలలో (మాంటుఫర్డు) ఆయన ఉన్నది కొలదికాలమే. అయితే నేమి ఆ కాలంలోనే ఆయన 'శప్టంబరు పరీక్షలు' ఏర్పాటుకోరి సాధించారంటారు.

ఆయన ఇన్ని ఉద్యమాలలో పనిచేసినా నిజానికి ఆయన హృదయానికి సామీప్యమైన ఉద్యమం స్త్రీజనోద్ధరణోద్యమం. అందాయనకు రాయసం వెంకటశివుడుగారు సహచరులు. 1920 కి ముందే ఆయన పేటపాలెంలో శారదానికేతనము నెలకొల్పి స్త్రీ విద్యాభివృద్ధిగావింప భవనాదికములుకూడా కొన్నారు. అదే ఆయన తీవ్రరాజకీయము లలో చిక్కుకొన్న తర్వాత శ్రీ ఉన్నవదంపతుల చేతులమీదుగా రూపుదాల్చి సాగుతున్నది.

ఆయనకు మగసంతానము లేదు. ఇద్దరు ఆడబిడ్డలు. ఇద్దరిని విద్యావతుల నొనర్చినారు. వారిలో శ్రీ పార్వతీదేవి బి. ఏ. విదేశములకుకూడా వెళ్ళి వచ్చియున్నది.

ఆయన గొప్ప విద్వాంసుడు, రచయిత, వాగ్మి. ఉపన్యాస మధ్యమున ఆయన కడ్డుపడితే, మరీ విజృంభించేవాడు ; 'వెర్రెత్తి' ఉపన్యసించేవాడు. కేవలము ఐహిక లంపటుడేగాడు ; పరాకాష్ఠగల్గినవాడు. సంపూర్ణజీవితమును అనుభవించి అస్తమించినాడు. ఆయన శీలము, దీక్ష, దక్షత, ఇత్యాది గుణగణాలను భవిష్యదాంధ్ర ప్రజకు అనుసరణీయములగు ఆదర్శాలుగా పనిచేసి, చూపి చనిపోయినాడు.

పంతులుగారి ఆత్మకు శాంతి కల్గుగాక. పితృవియోగ దుఃఖితలగు పంతులుగారి పుత్రికలకు "గృహలక్ష్మి" తన సానుతాపమును వెల్లడించుచున్నది.

## దేశభక్త శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులుగారి నిర్యాణ సందర్భములో

సార్థకంబొందె 'దేశభక్తా'ర్థకతన
త్వచ్చరిత్ర ; మా యీ తెల్గువారల బహు
పుణ్యవశమున తాతవై పూజ్యవైతి
వివిరొ మా ప్రణుతి శతము లీప్సితముగ.

దివ్యగాంధీజి సందేశము లక్షరా
   ల్పాటించు నిష్కామపటిమ యొకటి
తెలుఁగుతల్లి కనుచూపుల మెలంగి స్వరాష్ట్రి
   సముపార్జిత క్రియల్ సలుపుటొకటి
అజ్ఞాన తిమిరంబు లడగింప విజ్ఞాన
   పీఠముల్ గొన్ని స్థాపించుటొకటి
చావు బ్రతుకులలో సమయుచున్నట్టి కేఁటి
   జాతీయ కాంగ్రెస్లా నీతినియమ-
ములు, నిలుకడలు లేవంచు పలువిధాల
   చాటి యున్నట్టి యాధైర్యస్థైర్యగరిమ
దేశసేవా పరాయణ దీక్షయొకటి
   నీదు చిరతర సద్యశోనిధులుఁగావె ?

అల్లకల్లోలమై వెదఁజల్లునేఁటి
యాంధ్రసంద్రానమేటి చుక్కానివోలె
మెల్లమెల్ల నాచిఁగొని మమ్మెల్ల నొక్క
దరినిఁ జేర్పకేఁ గల్పించితౌర ! వెనుతు-
ఘాను : యీఘోరప్రళయమ్ముఁ బాయుటెట్లొ ?

ఎంత సంకల్ప సిద్ధుఁడవీవో ? ఎంత
పూజ్యమతివోఁ గాకున్న నేపుణ్యదివస-
మా స్వరాజ్య సంస్థాప మహాత్రిది వస
మందె ప్రాణంబు లర్పించు టాంధ్రభీష్మ.

కొండ వెంకటప్పయ్యను
మెండుగ మనమనుసరించి మెలఁగుటయే గా :
కొండంత దేవునికి యా
కొండంత పత్రితోఁ గొల్చుకొనుటేసుండీ.

గడ్డం రాజేశ్వరరావు

# కేసరి ప్రాథమిక పాఠశాల, త్యాగరాయనగరు
# ద్వితీయ భారత స్వాతంత్ర్య వార్షికోత్సవము



ద్వితీయ భారత స్వాతంత్ర్య దినోత్సవము త్యాగరాయనగరం కేసరి తెలుగు ప్రాథమిక పాఠశాలయందు జయప్రదముగా జరుపబడెను. ఈ పాఠశాల పెట్టిన ఒక నెలలోపుగ నిట్టి గొప్ప యుత్సవము ఇక్కడ జరుపబడెను.

స్వాతంత్ర్య దినోత్సవ సందర్భమున న్యాయాధిపతులైన శ్రీ సి. హెచ్. రాఘవరావుగారు అధ్యక్షపీఠమునలంకరించి, బడిపిల్లలను ఆశీర్వదించుచు ఆనాటి కార్యక్రమమును జరిపిరి. కేసరి పాఠశాలల సెక్రిటరి, శ్రీ యం. శేషాచలపతి పంతులుగారు అధ్యక్షులను ఆహ్వానించిరి. బడి బాలబాలికలు జాతీయగీతములు పాడుచు జాతీయ పతాకమును చుట్టి తిరిగారు. పిదప అధ్యక్షులు పతాకమును ఎగురవేయగ, బాలబాలికలు జండాకు వందనము లర్పించిరి.



ఈ సందర్భమున శ్రీ మన్యం వెంకట్రామయ్యగారు; శ్రీ పమిడిపాటి వెంకటాచలపతేశ్వరరావుగారు స్వాతంత్ర్య దినోత్సవమునుగూర్చియు పాఠశాలాభివృద్ధి మార్గమునుగూర్చియు ఉపన్యసించిరి. పిల్లలకు మిఠాయి పంచిపెట్టుటకుతగు ఏర్పాట్లు శ్రీ నేతి సుబ్రమణ్యంగారు చేసిరి.

ఉత్సవాంతమున ప్రధానోపాధ్యాయిని శ్రీమతి అన్నపూర్ణగారు ఎల్లరికి వందనములర్పింపగా సభ ముగిసెను.



పాఠశాల బాలబాలికలు జాతీయగీతములు పాడుచున్నారు.

# శక్తిపూజ

అద్వైతమతస్థాపనాచార్యుండగు నాదిశంకరుని మొదలు మారెమ్మ మొదలగు క్షుద్రగ్రామదేవతల నారాధించు పామరునివరకుగల అన్నితరగతుల జనులచేతను పూజింపబడుచున్న యీ శక్తి మహిమయెట్టిది? యీ శక్తిని పూజించుటచేత గల్గులాభమేమి? యను ప్రశ్నలు యెల్లరును వివరముగా నాలోచించిన దోచుచుండును. కావున శక్తిని గూర్చియు, పూజావిధానములగూర్చియు నెల్లరును తప్పక తెలిసికొనవలెను.

ఒక్క మన భారతదేశమునందేగాక యితర దేశముల వారుగూడ నేదోవిధముగా రెండుపదార్థము లున్నట్లంగీకరించియే యున్నారు. "ఏకమేవా అద్వితీయం బ్రహ్మ" అని చెప్పు వేదాంతులు సయితము ఈశ్వరునితో బాటు శక్తికూడ గలదని యంగీకరింపక తప్పదు అయితే వీరు శక్తియొక్క స్వరూపము ఇదమిత్థమని నిర్ణయింపలేక దానినే మాయయనియు, ప్రకృతియనియు, శక్తియనియు, అజ్ఞానమనియు, అవిద్యయనియు వేరువేరు పేర్లుచెప్పుచు. ఇట్టిదిగా నిర్వచింపజాలక "అనిర్వాచనీయము"ని మాత్రము చెప్పుచున్నారు. అది నిర్వచనీయమైనను అనిర్వచనీయమైనను, ఆ శక్తియే ప్రకృతిరూపముగా పరిణమించి చిత్రచిత్ర విలాసముల జూపుచున్నది. ఈ జగత్తంతయు ప్రకృతిమయము. ప్రకృతియొక్క విలాసమే జగద్విలాసము. ప్రకృతిలేక జగత్తుండజాలదు. ఈశ్వరునికిగల శక్తియే ప్రకృతియందురు. ఈశ్వరునివలనను ఆయన శక్తివలనను ప్రపంచముద్భవిల్లినదిగావునను, మనకుగల ప్రపంచానుభవమువల్ల స్త్రీపురుషు లిరువురుండినగాని సృష్టిగలుగదని తెలియుటచేతను, శక్తిని స్త్రీగాను, ఈశ్వరుని పురుషునిగాను వర్ణించుట సంభవించినది. కావున ప్రకృతియందు స్త్రీత్వము కల్పించి ఆమెనే యాదిశక్తిగా స్తోత్రము చేయజొచ్చిరి. ప్రకృతి శక్తిగా మారుటకు స్త్రీ సాధనమైనది. పిమ్మట స్త్రీయే శక్తియైనది. ప్రపంచమూలమైనది. కావున శక్తికి ఆదిశక్తియని పేరు. ఈ ఆదిశక్తినే ఆదిదేవి, మహాదేవి, మూలప్రకృతి మొదలైన పేర్లతో పిలిచిరి. ఈ కారణమున శాక్తేయులు వేరువేరు శక్తులనబడు నొక్క స్త్రీనే పూజింతురు.



అధ్యక్షులు, పాఠశాల శ్రేయస్కోరు తదితరులు ఉపన్యసించుచున్నారు.

ఈ ఆదిశక్తికి కాలక్రమేణ వేరువేరు పేర్లు, వేరువేరు ఆకారములు, ఫలప్రదాయక మహిమలు నారోపింపబడినవి. ఇట్టి దేవీభేదములను పురాణములలో చిత్రవిచిత్రములతో వర్ణించియున్నారు. ఒకదానితో నింకొకటి

బోలియుండవు. భిన్నభిన్న సాంప్రదాయముల ననుసరించి, భిన్న స్వరూప స్వభావములు గల్గియుండును. మానవులు తమతమ కోర్కెలు ఫలించి, ఆపదలు తొలగి, ఐహిక కోర్కెలు దీర్చుటకై దేవిని తమ భావనా కల్పితాకారములతో పూజింపజొచ్చిరి. ఈ పూజావిధానములే ఆగమములు, కల్పములు. యీ పూజా విధానమునం దనేక తరగతులు గలవు. దేశకాలపాత్రముల ననుసరించి యీ యాగమము లేర్పడెను. తత్వ మెఱుంగజాలని మానవులు తమమనః పరిపక్వదశ ననుసరించి తమకువచ్చిన విధానముల నేర్పరచుకొని యున్నారు.

ప్రధమమున శక్తి భయంకర స్వరూపిణియై, హింసాత్మకయై, జగత్తును వడకించుచు నేకచ్ఛత్రాధిపత్యము జేయుచున్న క్రూరకరాళరూపముగలదని భావింపబడి యాభావనల ప్రకారము భయంకరరూపముతో చిత్రింపబడి యారాధింపబడినది. ఇట్లు మానవుని పశుస్వభావమే శక్తిగా చిత్రింపబడె. ఇదియే తామసగుణయుక్తము. తరువాత మానవుడు క్రమముగా జ్ఞానాభివృద్ధిగాంచి, తత్వమెఱింగి, చిత్తసంస్కారముగల్గినకొలది ఆరాధనా విధానములలో మార్పు సహజముగాగల్గినది. ఆ మార్పులో దేవియొక్క భయంకరాకారముపోయి సౌమ్యమై, సుందరమైన రూపమేర్పడి రజోగుణయుక్తమైన పూజలు గావించిరి. యీ పూజలకు మామూలు శాకాహారములే నివేదనజేతురు. తామసగుణయుక్తులై క్షుద్రగ్రామ దేవతలను పూజించువారు పశుబలులనిచ్చి భీభత్సముగ జేతురు. ఇక సాత్వికపూజ మరీ జ్ఞాన యుక్తులైన వారిచేతనే చేయబడును.

ఈ శక్తికి నామము లనేకములున్నవి. అంబిక, ఉమ, కాత్యాయిని, కాళి, హైమవతి, దుర్గ, చండిక, నారాయణి మున్నగు ననేక నామములున్నవి. అయితే యీ పేర్లెవ్వరెప్పుడు పెట్టిరో తెలియదుగాని, అంబికయను పేరు మాత్రము వేదములందుగలదు. వేదములలో అంబికను రుద్రునకు సోదరిగా చెప్పబడియున్నది. ఉపనిషత్తులలో దుర్గ, హైమవతి, ఉమ మొదలగు పేర్లును వానిని గూర్చిన కథలు నచ్చటచ్చట గలవు. వేదాంత ప్రతిపాదికములగు నుపనిషత్తులలో సమస్త చరాచర రూపప్రపంచమునందో చు నఖిలపదార్థ సంచయమునందుగల వివిధశక్తులన్ను, ఆదిశక్తియొక్క అంశములేననియు, ఆదిశక్తియే బ్రహ్మవిద్యయనియు, ఆమెయే త్రిమూర్తి స్వరూపిణియనియు, త్రిమూర్తుల కాంతలగు లక్ష్మి, పార్వతి, శారదలుకూడ నామెయొక్క భిన్నస్వభావ మూర్తులనియు వర్ణింపబడియున్నది. ఇట్లు త్రిమూర్తుల శక్తులనే బ్రహ్మశక్తియనియు, వైష్ణవీశక్తి యనియు, శాంభవీశక్తి యనియు చెప్పిరి. అనగా త్రిమూర్తులందుగల శక్తులనే ఆయా నామక స్త్రీ శక్తులనుగా వర్ణించిరి. పైనదెల్పినదంతయు తత్వమునుగూర్చి యున్నది. ఇక స్థూలదశలో పురాణములలో నేమిచెప్పిరో విచారింతము. ఆదిశక్తి పూర్వము మహిషాసురుని చంపుటకై యవతరించినదని పురాణములలో వాకొనిరి.

దేవతలకును రక్కసులకును మహాయుద్ధము జరుగగా నందులో రాక్షసులోడిపోయిరి. అందులకు వారితల్లి "దితి" కోపముతో "మహిషి"కి రూపముదాల్చి పితామహునిగూర్చి తపముజేయగా బ్రహ్మ ప్రత్యక్షమై యామెను వరమడుగుమని శలవిచ్చె. అంతనామె దేవతలనెల్లరిని జయించునట్టి సుతునొసంగుమనియె. బ్రహ్మ దితికావరమొసంగె. తరువాత దితికి మహిషాసురుడుద్భవించె. వాడు మిక్కిలి పరాక్రమవంతుడు; అతికాయుడు. అతడు శివునిగూర్చి తపస్సుజేసి యా మహాదేవుని చేత పురుషుల చేత చావకుండునట్లు వరంబునుబొందె. ఆ వరమదమున గర్వించి, ఇంద్రుని జయించి, స్వర్గరాజ్యమును గైకొని, దేవతల తరిమివేసె. దిక్పతుల బంధించె. లోకకటంకుండైన మహిషాసురుని బాధలు బడలేక సురలు పరమేష్ఠికడకేగి మొత్తుకొనిరి. బ్రహ్మకుపాయముదోచక శివునితో గలసి విష్ణుమూర్తికడకేగెను. త్రిమూర్తులు చేరి యాలోచించుసమయమున ఆ ముప్పురి శరీరములనుండి తేజస్ఫురణలు పైకుబికివచ్చి విజృంభించెను. యీ తేజఃపుంజమంతయుగూడి యత్యంత ప్రకాశవంతమై, అందమై, దివ్యమణిగణభూషణాలంకృతమై,

అష్టాదశబాహువులుంగల యొకస్వరూపిణియయ్యెను. ఆమెను మహాదేవియని పిలచిరి. త్రిమూర్తులును, దేవతలును తమతమ ఆయుధములనిచ్చిరి. సింహము వాహనముగా చేయబడెను. మహిషాసురుని సంహరింపనామెను ప్రార్థించి, ప్రోత్సహించి పంపిరి. ఆ మ్మహాదేవి యా దుష్టుని వధించెను.

ఇంకొక గాథగలదు. "రురుని" కొడుకగు దుర్గుండను రాక్షసుడు తపస్సుచే శక్తిని సంపాదించి దేవతల బాధింపదొడంగెను. వారు భయమంది శంకరుని శరణుజొచ్చిరి. శంభుం డాదుర్గుని జంపుటకు శాంభవీ శక్తిని బంపెను. యామె వివిధోపాయములచే నాతని హతమార్చెను. ఇట్టిగాథలనిట వేరొక్కనుట చర్విత చర్వణమగును. యిట్టికథ లిదివరకు విననివారరుదు. కావున ప్రస్తుతాంశమునకు వత్తము.

భారతదేశమున పూర్వము చైత్రశుద్ధపాడ్యమి మొదలు నవమివరకును వాసంతీపూజయనుపేర దేవీపూజ జరుగుచువచ్చెను. కాని కాలక్రమేణ చైత్రమాసముమారి ఆశ్వయుజ శుద్ధపాడ్యమి మొదలు శరన్నవరాత్రములనుపేర దేవీపూజ చేయుచున్నారు. ఈ దేవీపూజను తొల్లి రావణాసురుడు వసంతకాలమున చేసెనట. తదుపరి శ్రీరాముడు రావణసంహారార్థము శరత్కాలములో దేవినారాధించి రావణసంహారము గావించెనట. అప్పటినుండియు ననుశ్రుతముగా శరత్కాలమునే యెల్లరును పూజించుచుండిరి. పెక్కుచోట్ల "శ్రీరామలీలా" మహోత్సవములుంగూడ జరుపబడుచున్నవి. మనదేశమున దుర్గాపూజయు, నుత్తరహిందూదేశమున కాళీపూజయుచేతురు. ముఖ్యముగా వంగరాష్ట్రమున కాళీ విగ్రహమును మిక్కిలి భయంకరాకారముతో 4 గజములయెత్తున నిర్మించి పూజింతురు. మనయాంధ్రమున దుర్గాదేవితోపాటు సంపదలొసంగు లక్ష్మిని, జ్ఞానమొసగు వాణిని ఆనుషంగికముగా నారాధింతురు.

ఆగమములు, కల్పములను పూజావిధానములు రెండుగలవని పైనదెల్పితిని. ఆ కల్పములు యేడు విధములుగానున్నవి.

1. నవమ్యాదికము. 2. ప్రతిపదాదికము 3. షష్ట్యాదికల్పము. 4. సప్తమ్యాదికల్పము. 5. అష్టమ్యాదికము. 6. అష్టమీకల్పము. 7. నవమీకల్పము. ధనవంతులు రెండవదానినిసేతురు. సామాన్యులు 4 వ విధాన మాచరింతురు. తక్కినవి ఆగమములలో చెప్పబడియున్ననూ ప్రస్తుతము ప్రచారములోమాత్రము లేవు. పైకల్పముల ప్రకారంచేయు పూజావిధానములన్నియు మూడుతరగతులుగా విభజింపవచ్చును. సాత్వికి, రాజసి, తామసి. మాంస నివేదనాదులులేక జప, యజ్ఞపారాయణలతో చేయునదియే సాత్వికి. యా విధానమే మనకెల్లరకును ఆచరణీయము.

దేశిరాజు భారతీదేవి.

# నవరాత్రులలో - మా సమాజం

"జ్యోతీ, జ్యోతీ, ఏంచేస్తున్నావే లోపల" అనిపిలిచింది వాళ్ళ అమ్మమ్మ. ముఖంమీాది చమట తుడుచుకొంటూ బయటికి వచ్చింది జ్యోతి. జ్యోతిలాగా వెలుగుతూ, ఆరోగ్యంతో కూడిన ఆనందం ఆమెముఖంలో వెలుగుతూ ఉంది. ఆనందానికి తగిన, అందము, వుత్సాహము కనపడుతూవున్నాయి.

అమ్మమ్మ: ఇంతసేపట్నుంచీ లోపల ఏంచేస్తూవున్నావే? పిల్లలొచ్చే వేళయింది కదూ? మరివాళ్లకేమైనా చేసివుంచావా?

జ్యో: ఆఁ. చేసివుంచనమ్మా. రేపు దసరాపండగలు ప్రారంభం కదూ; వాటికై ఏవో తయారు చేసుకొంటూ వున్నా.

అమ్మమ్మ: మీసమాజంలో కూడా రేపేనా ఏవిటి వుత్సవాలు మొదట?

జ్యోతి: ఆఁ. రేపే.

అమ్మమ్మ: ఈసారి విశేషాలేవిటి, మేంకూడా రావచ్చా?

జ్యో: వో. ఎందుకు రాకూడదూ; వూళ్ళోవున్న ఆడవాళ్ళంతా రావొచ్చు. మంచి ఏర్పాట్లు చేశామ్. పెద్దదిగావున్నా, మాసమాజం చాలదని, హైస్కూల్ ఆవరణంలో ఏర్పాటు చేశాము. ఆడపిల్లలంతా వాలంటీర్లయి అల్లరి చేయనీక చూస్తూవుంటారు. నాక్కూడా రెండుబహుమానాలొస్తాయని అనుకొంటూవున్నా. నేనుచేత్తో రాసిన బొమ్మలకు ఈధఫా తప్పక బహుమానం వస్తుందని మాసమాజంలో అందరూ అంటున్నారు. నేనురాసిన వాటిల్లోకల్లా "ఆంధ్రవనిత" చాలా బాగుందని మాచిత్రకళా పండితుడన్నాడు. మరిచూడాలి. ఎవరికి ప్రథమబహుమానం వస్తుందో.

అమ్మమ్మ: బహుమానాలు కూడా వున్నాయటే మీాసమాజంలో?

జ్యో: ఎందుకులేవూ? తొమ్మిదిరోజులూ ఏదో ఒకదాన్ని గురించి పోటీజరుగుతుంది. పెద్దపెద్దవాళ్ళచేత బహుమానాలు పంచిపెట్టుతూ వుంటారు.

ఇంతలో కేశవదేశ్ళ రేఖ గంతులేసుకొంటూ వాళ్ళఅమ్మదగ్గరికొచ్చిఅంది. "అమ్మా! మామేస్టరమ్మ చెప్పిందే ఈమాటు దసరాలో నాకు డ్యాన్సులో ఫస్టుప్రయిజు వస్తుందిట. మరి వాళ్ళవిజయకేమో సంగీతంలో వస్తుందిట. నాకుసంగీతం చెప్పించవే అంటే చెప్పిచ్చేవుకావు" అని మారామ్ చేయడం మొదలుపెట్టింది.

జ్యోతిమంచి చురుకుతనం కలస్త్రీ; అదీగాక మంచిచదువుకొన్న మనిషీ. కేవలం చదువుకోవడమేకాక చదువుకొన్న విషయాలు సాధ్యమగువరకూ ఆచరణలోకి పెట్టాలనే వూహకలది. కాబట్టే తనబిడ్డలో కలిగిన ఆచిన్న అసూయను త్రుంచివేయడానికి పూనుకుంది. ఆమెకు అసూయవల్ల బిడ్డల్లో కలిగే చెడుగూ, నష్టము బాగా తెలుసు.

జ్యో: ఛీ! అల్లా అనకూడదమ్మా, తప్పుకదూ. ఏం విజయకెందుకు బహుమానం రాకూడదు. అదీనీలాంటి పిల్లకాదేమిటి? ఎంతమంచిపిల్ల. మరి ఎంతచక్కగా వీణమీద పాడుతుంది. నీవంటే దానికెంతో ప్రేమ తెలుసా? నీవెంతో బాగా డ్యాన్సు చేస్తావని నాతో చెప్పుతూ వుంటుంది.

అమ్మమ్మ-మొన్ననూ వాళ్ళ రాజమ్మ భాగోతం చదువుతానంటే వెళ్ళానే; ఆవిడ చిన్నకూతురు సరోజను నీవెరుగుదువుకదూ? ఆ అమ్మాయి ఏదోకుట్టుకొంటూ వుంది. నాకళ్ళ కవి ఎంతో అందంగా కనబడ్డాయి. ఏవోపూలూ, లతలూ ముచ్చటేస్తున్నాయి. పిల్లకూడా ఎంతో అణకువైంది సుమా. పెద్దవాళ్ళను చూస్తే ఎంతోగారవం!

జ్యో: అవునమ్మమ్మా యీమాటు కుట్టులో దానికే బహుమతి అని మేమందరం అనుకొంటూ వున్నామ్.

అమ్మమ్మ: అన్నిటికీ బహుమతులుపెట్టి మీసమాజం వాళ్ళు మంచిపని చేశారే. ఏవంటే ఈఆశతోనైనా ప్రతివాళ్ళూ ప్రతిపనీ నేర్చుకొని బాగుపడతారు. ప్రతిసంవత్సరమూ వుంటాయా? లేక ఈసంవత్సరమేనా?

జ్యోతి: ప్రతి సంవత్సరం వుంటాయే. తొమ్మిది రోజులూ తొమ్మిది కళలకు ప్రాముఖ్యంయిస్తాము. మొదటిరోజు, "దసరా" అంటే ఏమిటి? దానిని స్త్రీలు ఏలావుపయోగించుకోవాలి" అనేవిషయంపై చర్చజరుగుతుంది. దాన్లో ప్రవేశించి చర్చించిన వాళ్ళకి బహుమానం యిస్తారు. రెండోరోజు 'ఆరోగ్యం శిశుపోషణ' పరీక్షజరుగుతుంది. పోయిన మాటు వాళ్ళచిట్టిబాబుకు మొదటిబహుమానం వచ్చింది. ఎంతోబలంగానూ ఆరోగ్యంగాను వుంటాడు. యిందువల్ల మనకు అర్థమవుతూవుంది; తల్లులు శ్రద్ధతీసుకొంటే పిల్లలెంత ఆరోగ్యంగా తయారయ్యేది. మూడవరోజు సంగీత పోటీవుంది. విన్నావుగా వాళ్ళ విజయకు వస్తుందని రేఖచెప్పింది. ఇకనాలుగోరోజే చిత్రకళాప్రదర్శనం. అయిదోరోజు వ్యాసరచన వుంటుంది.

అమ్మమ్మ: వ్యాసరచనఅంటే ఏమిటే, ఆడటమా, పాడటమా?

జ్యోతి: అబ్బే కాదమ్మమ్మా! వ్యాసం అంటే ఏదైనా ఒకదాన్నిగురించి రాయటం. ప్రతివాళ్ళూ ఏదైనానిర్ణయించిన సంగతిని వారివారియోగ్యతప్రకారం అక్కడేకూర్చొని రాస్తారు. వాటిల్లో ఏవిబాగావున్నాయో పరీక్షచేసి వాటికి బహుమానాలు యిస్తారు.

అమ్మమ్మ: మరి ఆరోరోజో?

జ్యోతి: ఆరోదినం పిల్లలనాట్యం జరుగుతుంది. విన్నావుకదూ మనరేఖ ఈదఫా తనకి ప్రయిజ్ వస్తుందని ఎగురుతూ వుంది. ఏడోదినం కుట్టుపరీక్ష జరుగుతుంది. ఎనిమిదో రోజు రాట్నం పోటీవుంది. ఈదఫా దాంట్లో చాలామంది కూచుంటామ్. దాదాపు 50 మందివుంటారు. అందరూ బాగావడికేవాళ్ళే మొన్న గాంధీగారు చనిపోయినప్పుడు నీవీవూళ్ళో లేవుగదూ? మాసమాజంలో వడికిన నూలు నేయిస్తే 50 గజాలగుడ్డ అయింది. మాసమాజ సభ్యులమే చేత్తో పరికిణీలూ, గౌనులూ అవికుట్టించి బీదలకు పంచిపెట్టామ్.

ఆఖరురోజు వినోదాలకు విడిచిపెట్టాం. మరి ఆరోజుసంతోషంగా జరపవలసిందేగా అదిగాక "హైదరాబాదులో మనవిజయం" అనేనాటికను హిందీక్లాసు పిల్లలు ప్రదర్శిస్తారు. ఆదినం 3గంటలకే వెళ్ళాలి. నీవుకూడా వస్తావుకదూ? వేరేవూళ్ళ నించీవచ్చిన పెద్ద పెద్ద చదువుకొన్న స్త్రీలు మాట్లాడుతారు.

అమ్మమ్మ, తెలుగులోనేనా?

జ్యోతి: మరేభాషలో అనుకొన్నావు? మనకి స్వాతంత్ర్యంవచ్చినా పరభాషల్లో మాట్లాడే ఖర్మమేం పట్టింది. ఇప్పుడన్నిచోట్లా మాతృభాషకే ప్రాముఖ్యం యిస్తూ వున్నారు. అదితప్పితే కాబోయే రాజభాషయని హిందీకి ఎంతోవిలువ వుందియిప్పుడు. నవరాత్రులలో మాసమాజం నిజంగా చూడవలసిందేగానీ చెప్పవీలు లేనంత వుత్సాహకరంగా వుంటుందే. దానికోసమైనా ప్రతివాళ్ళమూ ప్రతిపని ఎంతోశ్రద్ధతో నేర్చుకొన కోరుతూ వుంటామ్. ఏమంటావమ్మమ్మా?

అమ్మమ్మ: ఆఁ. నిజమేనే!

వి. సరస్వతీదేవి.

# దుర్గాదేవి కథ

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

లోకమంతటా సంచరిస్తూవున్న దుర్గముని దూతలు శతాక్షీవృత్తాంతం అతనికి తెలియపరచారు. దుర్గముడాపట్టుని అనంతమైన సేనలతో, మహాకోలాహలంగా భూమిబుగ్గయి పోయేటట్టు దండెత్తి హిమాలయ పర్వతాన్నాక్రమించి దేవతలనూ, బ్రాహ్మణులనూ పట్టుకుని హింసించడం మొదలుపెట్టాడు.

అప్పుడామరులూ, బ్రాహ్మణులూ శతాక్షీదేవిని మహాభక్తిశ్రద్ధలతో 'అమ్మా! అన్యథా శరణం నాస్తి; త్వమేవ శరణం మమ తస్మాత్ కారుణ్యభావేన రక్షరక్ష మహేశ్వరీ!' అంటూ ప్రార్థించారు.

ఆ వెంటనే ఆమె వారి రక్షణార్థం మహాతేజస్సుతో జాజ్వల్యమానంగా ప్రకాశించే ఓచక్రాన్ని సృష్టించి, వారిచుట్టూ వుండేటట్టు వేసింది. ఆ చక్రమధ్యభాగంలో వారు నిర్భయంగా హాయిగా వున్నారు. దుర్గముని బాణాలు వారినేమీ చెయ్యలేకపోతున్నాయి.



ఆ విధంగా దేవి దేవతలనూ, బ్రాహ్మణులనూ సంరక్షించి, దానవసేనలతో యుద్ధానికి సిద్ధమైవుంది. దేవికీ రాక్షసులకూ పోరు ఘోరంగా సాగుతూవుంది. బాణాలరాపిడివల్ల బయలుదేరిన అగ్నిహోత్రం లోకాన్ని చుట్టుముట్టింది. అస్త్రశస్త్రయుద్ధానికి అంతూ పొంతూ లేదు. ధనుష్టంకారధ్వనులు దిగంతాలను వ్యాపించి చెవులు చిల్లులుపడుతున్నాయి.

అలాంటి సమయంలో శతాక్షీదేవి దేహాన్నుండి కాళికా, తారిణీ, బాలా, త్రిపురా, భైరవీ, రమా, బగళా, మాతంగీ, త్రిపురసుందరీ మాక్షీ, తులజా, జంభినీ, మోహినీ, ఛిన్నమస్తా, గుహ్యకాళీ, దశసహస్రబాహుకా అనే ముప్ఫైరెండు శక్తులూ, ఆశక్తులనుండి మరో అరువదినాలుగు శక్తులూ అలా అసంఖ్యాకంగా సాయుధసహిత శక్తులెన్ని బయలుదేరాయో లెక్కలేదు. అలాబయలుదేరిన అనంతము లయిన శక్తిసమూహాలు భేరీమృదంగ ఢక్కా ఢమరూ మున్నగు భయంకర ధ్వానులతోనిండిన రణరంగంలో ప్రవేశించి,

ఒకవంద అక్షౌహిణీ రాక్షససైన్యాలను చీల్చిచెండాడాయి. తన సేనలలా హతమారిపోగానే దుర్గముడు మరికొన్ని సేనలను తీసుకొని ఆశక్తులమీద విజృంభించాడు. అప్పుడా శక్తులకూ దుర్గమునకూ పదిరోజులు రాత్రీపగలూఅనే భేదంతెలియకుండా ఘోరమైన పోరాటం జరిగింది. నెత్తుటి ఏరులుపారాయి. యుద్ధభూమి దానవుల శవాలతో నిండిపోయింది.

అలాతనసేనలకు సంభవించిన దుస్థితికి దుర్గముడు మనస్సులో విచారించి పదకొండవరోజున ఎర్రని పీరగంధం వంటినిండా పూసుకుని, ఎర్రని పూలమాలలూ, ఎర్రని ధోవతులూ ధరించి, మహోత్సాహంతో బ్రహ్మాండమైన రథాన్నారోహించి, చావగా మిగిలిన సేనలన్నిటినీ తోడుతీసుకుని, శతాక్షీదేవి రథానికి అభిముఖంగా తన రథాన్నిపోనిచ్చి ఆమెతో తలపడ్డాడు. అప్పుడు వారిద్దరికీ రెండుఝాముల కాలం పోరాటంసాగింది. ఈ లోపునవాడు ఆమె శక్తులన్నిటినీ నిర్జించి, ఆమెమీద విజృంభించాడు. అలా విజృంభిస్తూవున్న వానిని దేవిచూసి, పదిహేనుబాణాలు ధనుస్సుకు సంధించి, వాటిలో రెండుబాణాలతో వాడిరెండుకళ్లనూ, రెండుబాణాలతో బాహువులనూ, నాలుగమ్ములతో వాడిరథమునకున్న గుర్రాలనూ, ఒక్కశరంతో ధ్వజమునూ, మరొక్కశరంతో సారధినీ, మిగిలిన అయిదమ్ములతోనూ వాడిగుండెలనూ కొట్టి పారవేసింది. వాడాదెబ్బతో నెత్తురు కక్కుకొని క్రిందపడి మరణించాడు. వాడలా మరణించగానే వానిలోని తేజస్సు ఆమెలో ఐక్యమైంది.

పరమపాపాత్ముడయిన దుర్గముని మరణానికి సకలలోకాలూ ఆనందించాయి. దిక్కులు తేజస్సుతో పిక్కటిల్లాయి. హరిహర బ్రహ్మాది దేవతలూ, బ్రాహ్మణులూకలిసి ఆమెను అనేకవిధాల స్తోత్రం చేశారు. వారిస్తోత్ర పాఠాలకామె సంతోషించి-

'ఓబ్రాహ్మణులారా! ఇప్పటి నాయీస్వరూపాన్ని భావించి పూజించిన పుణ్యాంగనలకు ఇహపరసౌఖ్యాలఖండంగా అబ్బుతాయి. దుర్గమ దానవుని నిమిత్తం శతాక్షిని కావడంవల్ల శతాక్షీ, దుర్గముని సంహరించడంవల్ల దుర్గాఅనేపేరులతో నేనుంటాను. ఇకవాడపహరించిన మీచదువు సంధ్యలన్నీ మీకు యథాప్రకారం అబ్బుతాయి. శతాక్షీ, దుర్గానామాలు స్మరించిన వారి సకల పాపాలూ హరిస్తాను అన్నది.

ఇది చాలారహస్యమైనగాథ. ఈ గాథను చదివినా, విన్నా మేలుకలుగుతుంది. శుభాలబ్బుతాయి. చివరకు దేవీ లోకంవస్తుంది. భక్తులీకథను భద్రపరచుకోవాలి.

(నాదేవి భాగవతంనుండి)

# నా చిన్ననాటి ముచ్చట్లు

కే. యన్. కేసరి.

## అరవలు - ఆంధ్రులు

మొత్తముమీద అరవలు ఆంధ్రులకంటె బుద్ధికుశలురని చెప్పకతప్పదు. ఆదిలో నేను మద్రాసునందు అరవలతోకూడ బాడుగయిండ్లలో కాపురముండుటవలనను, చిన్నతనమునుండి చెన్నపట్టణములో అరవలతోకూడ పెరిగి పెద్దవాడనైనందునను, అరవల సాంగత్యమునకు అలవడినవాడనైనందునను నా చిరకాలానుభవమును ఆంధ్రగృహలక్ష్ములకు దెలుపుట న్యాయమనితోచి ముందుగ అరవకాపురమును తెలుగుకాపురమును గురించి తారతమ్యము వ్రాయుచున్నాను.

### అరవకాపురము - తెలుగుకాపురము

నేను మొదట జార్జిటవున్ నారాయణమొదలివీధిలో యొకచిన్నయింటిలో కాపురముంటిని. నాతోకూడ ఒక అరవ బడిపంతులు కాపురముండెను.

పంతులు పేరు వెంకటేశయ్యరు. వీరి భార్యపేరు మంగళాంబ. వీరికి యిరువురు బిడ్డలుండిరి. నాభార్య అప్పుడే కాపురమునకు వచ్చినది. ఈ బడిపంతులకును నాకును మాసమునకు రు 20 లు మాత్రమే వరుంబడియుండెను. మేముండిన యింటిలో యొక భాగమునకు 1-6 0 నెలకు బాడుగను నేనిచ్చుచుంటిని. మరియొక భాగమునకు అయ్యరు నెలకు రు 2 లు యిచ్చుచుండిరి. వారిది తంజావూరుప్రాంతము. మాది వంగోలు ప్రాంతము. నాకుకొద్దిగ అరవము తెలిసినను వంగోలాబిడకు అరవభాష అయోమయముగ నుండెను. అయితే అరవగృహలక్ష్మి ఆంధ్రగృహలక్ష్మివద్ద కొలదికాలములోనే తెలుగు భాషను చక్కగనేర్చుకొని మాతో ధారాళముగ సంభాషించుటకు తయారైనది. తెలుగుగృహలక్ష్మి అరవభాషను వెక్కిరించుటకు తయారైనది. నేను మా ఆ బిడను అరవమును నేర్చుకొనరాదా యని హెచ్చరించినపుడు 'ఆ అరవమొత్తుకోళ్లు, ఆ చింతగుగ్గిళ్లు నాకక్కరలే'దని చీదరించుకొనుచుండెడిది.

అరవలు ఆంధ్ర దేశమునకు డిప్టీకలెక్టర్లుగను, అయ్యవార్లుగను, లాయర్లుగను ఇంజనీర్లుగను వచ్చి కొలది కాలములోనే తెలుగుభాషను చక్కగనేర్చుకొని వ్యవహారములను తెలుగువారికంటె నేర్పుగ నెరవేర్చుకొనుచుండుట తెలుగువారికి తెలిసిన విషయమే. అరవలాయర్ల ఆడవారు పురుషులకంటే ముందుగనే తెలుగునేర్చుకొని కక్షిదార్లవద్దనుంచి ఫీజును నిర్ణయించుకొనుచుండిన విషయమును ఫీజునుమించి సప్లైలను రాబట్టుచుండిన సంగతిన్నికూడ నాకు దెలియును. అరవవారిబిడ్డలు తెలుగుబళ్లలో చదువుకొని ఆంధ్రభాషాప్రవీణులయినవారిని కొందరిని నాకు దెలియును. అట్టివారిలో నేడు తెలుగుపత్రికలలో తరుచు వ్యాసములు వ్రాయుచుండు శ్రీరామచంద్ర అగస్త్యయం. ఏ గారున్నూ వారిసోదరియు తెలుగువారికి బాగుగా పరిచితులు.

మన ఆంధ్రసోదరులు చిరకాలముగ మద్రాసు స్థిరవాసముగ నేర్పరచుకొని స్థిరాస్తులను సంపాదించుకొనియుండినను అరవభాషను ధారాళముగ మాట్లాడుటకు అసమర్థులైయున్నారు. ఇందుకు ముఖ్యకారణము అకారణమగు అసూయయు, అసహ్యతయునే. తెలుగులాయర్లవద్దకు అరవకక్షిదార్లు రాకపోయినను .అరవవారివద్దకు తెలుగువారు పోవుచునేయున్నారు. తెలుగువారే కొందరు ఆంధ్రరాష్ట్రోద్యమమును వ్యతిరేకించుచుండగా ఆంధ్ర దేశములో (నెల్లూరులో) నివసించుచుండిన అరవవారగు సంతానరామయ్యంగారు, అణ్ణాస్వామిఅయ్యరు, టి. వి. వేంకట్రామయ్యరు మున్నగువారు అనుకూలతచూపి ఆంధ్రులఅభిమానమును బడయుచుండిరి.

కేసరి హైస్కూలునందు రాధాకృష్ణశాస్త్రి (B. A. L. T. B. O. L) అను అరవ అయ్యరు తెలుగుపండితులుగనుండి ఇటీవలనే రిటైరు అయినారు. వీరు తెలుగుగ్రంధములనుకూడ వ్రాసిరి. ఇటువంటి అరవతెలుగుపండితులు మద్రాసులో మరికొందరున్నారు.

నారాయణమొదలివీధిలో మొదట మేము కాపురముండిన ఇంటివంటఇండ్లు చాల చిన్నవైనను అరవతల్లి మంగళాంబ తనవంటగదిని అమితపరిశుభ్రముగ నుంచుకొను నేర్పరిగ నుండెను. ఆమె ఆ చిన్నవంటగదిని చక్కగచిమ్మి తడిగుడ్డతో తుడిచి ఆ రాతి నేలను అద్దమువలె పెట్టుకొనుచుండినది. పానపాత్రలను బూడిదతో తోమి తళతళమని మెరయునట్లుగచేసి వాటిని వంటయింటి అలమరలో చక్కగబోలించి పెట్టుచుండెను. అంట్లతప్పెలనుకూడ ఆమెనే తోముకొని బోలించుచుండెడిది. ఇట్లు చేయుటవలన ఆ వంటయిల్లు అలంకారముగ నుండెడిది. అరవవారి అంట్లను రాతిమరిగలను శూద్రమనిషి తోమకూడదు గనుక అంట్లలోవేయు అన్నము మిగులుచుండెను.

ఆదివారమునాడు అయ్యారు అంగడినుండి బియ్యము, పప్పు వగైరా సామానును తెచ్చినవెంటనే ఇల్లాలు వెలుతురులో కూర్చుండి ఓపికతో రాళ్లురప్పలను యేరి తీసివేసి మూతలుండు డబ్బాలలో పోసి జాజికాయచెక్కలపెట్టెలో పెట్టి భద్రపరచుచుండెడిది. వారి భోజనసామగ్రినంతయు ఈపెట్టెలోనే యిమిడ్చి పెట్టుకొనుచుండినది. చింతపండును తెప్పించి దానిలోనుండు విత్తులను, ఈనెలను రాళ్లను తీసివేసి అందులో కొద్దిగ వుప్పును వేసి మెత్తగదంచి 30 వుండలనుచేసి యెండబెట్టి జాడీలో పెట్టుకొనుచుండినది. ప్రతి దినము ఒకవుండను రాతిమరిగలో నానవేసి ఆపులుసును అన్నిటికిని వాడుకొనుచుండినది. అంగడి వుప్పును ఆ దినమునకు కావలసినంత తీసుకొని రాతిచిప్పలోవేసి నీళ్లలో కరగ నిచ్చి భోజనపదార్థములలో ఆ వుప్పునీటిని వేయుచుండినది. ఇందువలన ఆ వుప్పులో యున్న రాళ్లు మన్ను మనకడుపులోకి పోకయుండును. నేతిని వీరు వాడరు గనుక నూనెనుమాత్రము తెప్పించి జాడీలోపోసి వాడుకొనుచుండిరి. నూనెలో బెల్లమును వేసి నందున నూనె చేటబడును. మజ్జిగకు బదులు సాతీర్థమును (వుల్లనీళ్లు) వాడుకొనుచుండిరి. మోదుగఆకులను తెచ్చుకొని తీరికకాలములో భార్యాభర్తలు కూర్చుని ఎకచకములాడు కొనుచు జానెడు విస్తళ్లను కుట్టుకొని వాడుకొనుచుండిరి.

వారి వంటకు చిన్నమట్టిపొయ్యిని సొగసుగ ఆమెయే వేసుకొనును. పొయ్యిమంట వృథాగాపోకుండ పొయివద్ద కూర్చుండి నేర్పుగ మంటవేయుచు కొద్దిపుల్లలతోనే వంటంతయు చేయుచుండినది. అన్నమును వండు కంచుతప్పెల అడుగున మట్టిపూసి పొయ్యిమీదపెట్టును. ఇందువలన తప్పెలను అరగ తోము పనియుండదు. వీరి భోజనా నంతరమున అంట్లతప్పెలను ముంగిటిలో వేయును. పాడు కాకివచ్చి తప్పెలను అటుయిటు దొర్లించి గణగణశబ్దమును చేయునేగాని ఆ కాకిముక్కుకు ఒకముక్క మెతుకైనను దొరకదు. వీరు స్నానమునకు బావినీళ్లు పానమునకు వేడినీళ్లను వాడుకొనుచుండిరి. ఒక పూటమాత్రమే వీరు వంటచేసుకొనుచుండిరి. సాయంత్రము వంటప్రయత్నములేదు గనుక అయ్యారు బడినుండి వచ్చినవెంటనే యిరువురు స్నానముచేసి అలంకరించుకొని ఇంటిసమీపముననుండు చెన్నకేశవ పెరుమాళ్లసన్నిధికి సరిగా ప్రసాదసమయమునకు బిడ్డలతోకూడ పోవుచుండిరి. ఈ విష్ణుసన్నిధిలో దినము పులిహోరను, దధ్యోజనమును భక్తులకు పంచిపెట్టుచుండిరి. ఆప్రక్కననే శివాలయముకూడ యుండినను అక్కడికి భక్తు లెవరుపోరు. ఏలననగా శివాలయములో ప్రసాదముగ విభూతి నిచ్చెదరు గనుక.

ఈ మంగళాంబకు ఒడిబిడ్డ, ఎడబిడ్డ యిద్దరు బిడ్డలుండిరి. ఒడిబిడ్డకు డబ్బాపాలకు బదులు రాగులను నానవేసి బండమీద నూరి ఆ రాగులపాలను గుడ్డలో వడియగట్టి కాచి

అందులో కొద్దిగ బెల్లమునుకలిపి ఆకలెత్తినపుడెల్లను ఒడిబిడ్డకు మితముగ యిచ్చుచుండినది. ఈ రాగులపాలవలన ఆ చంటిబిడ్డ రబ్బరుబొమ్మవలె బుసబుసలాడుచు పెరుగుచుండెను. ఈ రహస్యము అరవతల్లులకు తెలియును. ఎడబిడ్డ ఏడ్చినపుడు వరిపేలాలు బెల్లముకలిపి చేసిన బొరుగువుండలను యిచ్చుచుండినది. ఈ ఆహారమువలన పిల్లవాని ఆరోగ్యముకూడ బాగుంటూవచ్చినది. ఆదివారమునాడు అయ్యరుకు తెల్లగెనుసుగడ్డలను కుమ్ములో పెట్టి ఫలహారము పెట్టుచుండినది. ఈ తెల్లగెనుసుగడ్డలనే నెహ్రూగారు ఈ కఱవుకాలమున అందరికి ఆరోగ్యమైన ఆహారమని పలుమారు చెప్పుచున్నారు. ఈ రహస్యమును అరవతల్లి ఆకాలముననే గ్రహించినది.

ఈ అరవవారికి తెల్లవారగనే కాఫీ, ఫలహారములు అలవాటులేదు. అయ్యర్ తెల్లవారగనే స్నానముచేసి, జుట్టును జారుముడివేసి విభూతిని వళ్లంతయు పూసుకొని వెంటనే వంటయింటిలోకిపోయి రాతిమరిగలో పులియుచున్న పుల్లనీళ్లఅన్నమును నీళ్లను కడుపారత్రాగి జఠ్ఠున త్రేపుచు బైటకువచ్చి ఉడుపులను తగిలించుకొని పాఠశాలకు పోవును. మరల అయ్యరు ఒకగంటకువచ్చి వేడిఅన్నమును తినును.

ఈ అయ్యర్ అయ్యవారికి నెలకు జీతము రు 20 లు గనుక జీతమును తీసుకొన్ననాడె దోవలోనున్న పోస్టాఫీసుకుపోయి సేవింగ్సుబ్యాంకిలో రు 5 లు కట్టివచ్చును. మిగత రు 15 లు యిల్లాలివద్ద తెచ్చియిచ్చును. ఈ పైకముతో మంగళాంబ యింటిఖర్చు సంతయు పొదుపుగగడిపి సంవత్సరమునకు రు 20 లు కూడబెట్టుకొనును. వంటచేసిన పొయిలోని నిప్పును చల్లార్చి ఆబొగ్గులను కళాయిపూయువారికి అమ్మును. పాతగుడ్డలనిచ్చి పరకకట్టలను కొనును. పాతచీరలలో చించిన సరిగపేటనిచ్చి కంచులోటాలను గ్లాసుటంబ్లర్లను కొనును.

ఈవిధముగ అరవతల్లి సంసారమును జాగ్రతగ గడుపుకొనుచు భర్తయిచ్చిన పైకములో మిగుల్చుకొనిన రు 20 లతో కూడ చిల్లరసంపాద్యమును కలిపి దీపావళి పండుగనాడుకొర్నాడు పట్టుచీరెనుకొని కట్టుకొనును. ఆకాలమున పాతికరూపాయలకు మంచి కొర్నాడుచీరె వచ్చుచుండెను. ఈ తల్లి వంటయింటిలోను, పడకటింటిలోను ఈచీరెనే కట్టుకొనుచుండినది. పేరంటములకు దేవాలయములకు ఈ చీరెనే కట్టుకొని పోవుచుండినది. తనచీరెను తానే వుతుకుకొనుచుండినది. తెల్లవారగనే స్నానముచేసి ఆ చీరెను కట్టుకొని దినమంతయు గడుపుచుండినది. ఆ చీరను యెప్పుడుచూచినను అప్పుడే అంగడినుంచి తెచ్చినట్లు కనుబడుచుండినది. ఈమెవద్ద పాత పండుగచీరెలుకూడ కొన్నియుండెను. ఈ చీరెలుకూడ క్రొత్తచీరెలవలెనే కనుపడుచుండెను. గనుక ఈమె గుడ్డల దరిద్రములేకుండ కాలమును గడుపుచుండినది.

ఈ అరవతల్లికి భోజనానంతరము నిదురబోవు దురలవాటు లేదు. కుట్టుపనినిగాని, చదువుకొనుటగాని, అప్పడాలు వత్తుటగాని చేయుచుండును.

చంటిబిడ్డ యేడ్చినపుడు గుడ్డఉయ్యాలలో పరుండబెట్టి జోలపాటలను పాడుచుండును. అప్పుడప్పుడు త్యాగయ్యగారి కృతులను కంఠమెత్తి శ్రవణానందముగ పాడుచుండినది. భక్తిరసముగల పురందరదాసు కీర్తనలనుకూడ పాడుచుండెను. భర్త యింట నుండిననాడు ఈతల్లిపాటలను నేను వినగోరినప్పుడు అడ్డుచెప్పక పాడుచుండెను. కావేరి తీరమున పుట్టిన పుణ్యాత్ములందరు చక్కగ పాడనేర్చినవారె.

మంగళాంబ ఒడ్డుపొడుగుకలిగిన మంచివిగ్రహము. తెల్లవారగనే స్నానముచేసి కురులను కురచగ దూముడి వేసుకొని పట్టుకోకను కట్టుకొని కుంకుమను పెట్టుకొని నప్పుడు మంగళాంబ కామేశ్వరివలె కళకళలాడుచుండెడిది. ఈమెకు పరిశుభ్రతయే మంచి మడి, ఆచారము.

మంగళాంబ ప్రతిదినము తెల్లవారగనే చన్నీళ్లస్నానమును చేయుటవల్లను అభ్యంజనమునాడు తలకు చీకిరేణిపొడిని వాడుటవల్లను ఆమె కురులు సున్నగను నల్లగను పట్టుకుచ్చువలె నుండెడివి. చన్నీళ్లస్నానమువలన మన మెదడు చల్లబడి కురులు పొడవుగ పెరుగును. కావేరీతీరవాసులకును మలబారువారికిని తెల్లవారగనే శీతలోదకమునస్నానము చేయు అలవాటుగలదు. మలబారువారు తలకు బెండాకును రుద్దుకొనెదరు. చీకిరేణి పొడిలోను, బెండాకులోను జిగురుపదార్థముండుటవలన వెంట్రుకలు బిరుసుగనుండవు.

వంగోలుప్రాంతమున తలంటుస్నానమునాడు సాధారణముగ కుంకుడుకాయల నురుగుతో తలంటి పోసుకొనెదరు. కుంకుడుకాయలనురుగు అత్యుష్ణముగనుక తల వెంట్రుకలు వరిగడ్డివలె గరగరలాడుచుండును. తలవెంట్రుకలు చిట్లిపోయి కురచబడును. త్వరలోనే వెంట్రుకలు తెల్లబడి వండ్లూడిపోవును. మా ఆబిడ మంగళాంబను చూచి అయినను నేర్చుకొనక పుట్టింటి అలవాటును మార్చుకొనజాలక కుంకుడుకాయలనే వాడుకొనుచుండినది.

తలకు చల్లనీళ్లను వంటికి వేడినీళ్లను వాడుకొనుట మంచిది. కొందరు తలలోని పేలు ఈపి నశించిపోవుటకు మసిలెడు నీళ్లను పోసెదరు. ఇందువలన కొందరు సొమ్మసిల్లి మూర్ఛపోవుటకూడ తటస్థించును.

నదీప్రాంతములలో నివసించువారు నల్లరేగడమన్నుతో కొందరు తలను రుద్దుకొను అలవాటుగలదు. ఇది చాల మంచిఅలవాటు. ఇప్పుడిప్పుడే పాశ్చాత్యపుస్త్రీలు ఈ రహస్యమును గ్రహించి వాడుచున్నారు.

వీరు మార్కెట్టుకుపోయి కూరగాయలనుకొని తెచ్చుకొను అలవాటులేదు. దినము పొరిచకొళంబు, తయ్యిచారు, కాల్చిన అప్పడము, యెండుదబ్బకాయ పూరగాయ వీనితో రెండుపూటలు భోజనమును ముగింతురు. ఈ సాత్వికాహారముతో వీరి ఆరోగ్యమును కాపాడుకొనుచుండిరి. ఎప్పుడైనను మందుకావలసివచ్చినపుడు నేను కొలువుండిన శ్రీ కన్యకాపరమేశ్వరి ధర్మవైద్యశాలకువచ్చి మందులను పుచ్చుకొనుచుండిరి. అయ్యరు చీటికిమాటికి మంగళం, మంగళం అని పిలుచుచు చీట్లపేకను ఆడుకొనుచు కాలమును కులాసగ గడుపుకొనుచుండిరి.

ఇక మా తెలుగాబిడ సంగతి వ్రాసెదను.—

ఈ బిడ వంగవోలు ప్రాంతమునుండివచ్చినది గనుక ఆ పల్లెటూరి ఆచారము ననుసరించి తనవంటయింటిని ప్రతిదినము మట్టిపేడతో మెత్తి అలుకుచుండినది. ఇందువలన వంటయింటిలో కాలుపెట్టిన దిగబడుచుండెను. ఈమె వంటయింటి నిండుగ ముగ్గులు వేయుచుండెను. మా యిరువురి వంటకు నాలుగురాతిపొయిలను కూలిచ్చి వేయించినది. మాసమునకు కావలసిన కట్టెలను పిడకలను ఒకేతడవ తెప్పించి పొయిలప్రక్కననే పేర్చిపెట్టినది. భోజనసామగ్రిని వుంచుకొనుటకు కొన్నికుండలను, బానలను తెప్పించి వంటయింటి దక్షిణపుతట్టు కుదుళ్లమీద వరుసగపెట్టినది. ఒకమూల గంజిగుంటను, మరియొక మూల దాలిగుంటను యేర్పాటుచేయించినది.

వంటయింటినిండుగ వుట్లను వ్రేలాడగట్టించినది. ఆ గదినిండుగ పల్లెటూరు పాత్రసామానును—అనగ నిలువుచెంబులు, బుడ్డిచెంబులు, దోసకాయచెంబులు, జోడితప్పెల, దబరాగిన్నె మొదలగువాటిని పరచిపెట్టి వుంచును. రాతిచిప్పలు కూడ వుండును. వంట త్వరలో చేయుటకు నాల్గుపొయిలను ఒకేసారి బుడ్డికిరసన్‌నూనెతో ముట్టించును. పొయినిండుగ కట్టెలు పిడకలను తురిమి స్నానమునకుపోవును. వచ్చులోపల యిల్లంతయు పొగకమ్ముకొని యింటిలో వస్తువులుకనబడక తట్టుకొనుచుండుటయేగాక ఇల్లాలి కండ్లనిండుగ నీలాలు కారుచుండును. వైదికులమడి తడిగుడ్డగనుక తడిగుడ్డతోనె వంటచేయుచుండెను. అయితే వంట ముగియులోపల మడిబట్ట ఆరుచుండెను

మా యింటిలో వేయించిన కందిపప్పే వాడుక గనుక ప్రతిదినము ముద్దపప్పు లొడ్డుపులుసు, వేపుడుకూరలు, రెండుపచ్చళ్లు, పండుమిరపకాయలకార ముండితీరవలయును. రాత్రిళ్లు అన్నములోకి పప్పుపొడి, గోంగూర, చింతకాయపచ్చళ్లు, చిక్కటిమజ్జిగ ఉండ వలయును. ప్రతిశుక్రవారము అమ్మణ్ణికి నేతిగారెలను నైవేద్యము పెట్టుచుండినది. పిండి వంటల నోమును పట్టుచుండినది. నోము పుద్యాపనకు గారెలను బూరెలను నేతితో చేసి బుట్టనిండుగపెట్టి ముత్తైదువకు వాయనమిచ్చుచుండినది. శనివారం వెంకటేశ్వరునకు చలి విడిపిండి, నేతి దీపారాధనే చేయుచుండెను. వ్రతమునకు వండిన నేతిగారెను ఒక్కటైనను నా కివ్వమని ఆశపడి అడిగినప్పుడు వ్రతమునకు చేసినవాటినిచ్చిన వ్రతభంగము కలుగునని నిర్దాక్షిణ్యముగ నిరాకరించెడిది.

వరలక్ష్మివ్రతమునాడు అరవతల్లి మంగళాంబను భోజనమునకు పిలుచును. అప్పు డామె నా భర్తను విడిచిపెట్టి నేను విందుభోజనముచేయుట వీలుగాదని చెప్పెను. అప్పుడు నేను అయ్యర్‌ను కూడ భోజనమునకు రమ్మనెదను. ఆనాడు అరవకుటుంబమంతయు మాయింటనే భుజింతురు. భోజనసమయమున నేతిని చేతిలోవేసినపుడు ఆనేతిని వారేమి చేయవలయునో తెలియక దానిని త్రాగెదరు కొద్దిగ పెదిమలకు రాచుకొనెదరు. భక్ష్య ములకుగాను చంటిబిడ్డకు కూడ ఆకువేసి కూర్చుండబెట్టెదరు. ఆ రాత్రి మజ్జిగను త్రాగి పరుండెదరు.

మేము కూరలకు నూనెవాడిన తలతిరుగును గనుక అన్నిటికి నేతినేవాడుచుంటిమి. ఈ కారణములవల్ల నా నెలజీతము నేతికికూడ చాలకుండెను. ఆ కాలమున మంచి నెయ్యి రు 1-4-0 వీశ అమ్ముచుండెను.

ఒక వైద్యుడు కాకరకాయలో క్వయినాగలదు గనుక దినము తినుచుండిన మలేరియాజ్వరము రాకుండుటయేగాక మంచి ఆరోగ్యముకూడ కలుగునని చెప్పినందున నేను ప్రతిదినము కొత్వాలుచావడి మార్కెట్టుకుపోయి మంచి పెద్దకాకరకాయలను తెచ్చుచుంటిని. ముళ్లవంకాయలు చిన్నవి (కర్పూరపు వంకాయలు) రుచికరముగ నుండునుగనుక వాటిని తెచ్చుచుంటిని. దేశవాళి గోంగూర కనుబడిన విడుచువాడను గాను. ఒంగోలువారికి పచ్చళ్లలోకూడ పచ్చిమిరపకాయలను కొరుక్కొనుట అలవా టున్నందున వాటిని తెచ్చుచుంటిని. పచ్చిమిరపకాయలో మంచివైటమిన్ (Vitamin) వున్నట్లు నవీనవైద్యవేత్తలు కనుగొనిరి. అందువలననే గుంటూరు గడ్డలో పుట్టినవారి దేహదార్ఢ్యమునకు ముఖ్యకారణము పచ్చిమిరపకాయలనియే చెప్పవచ్చును.

మా ఆబిడ మద్రాసుకు వచ్చునపుడు నేను పెండ్లినాడు పెట్టినరోజారంగు బనా రసు సరిగచీరె, బాలామణిచీర, చిలుకపచ్చ సాదాపట్టుచీరెలను, తల్లిగారుపెట్టిన ముదురు

లేతచుట్టుచంగావిచీర, కోటకొమ్మంచువేసిన తెల్లచీరెను తనతోకూడ తెచ్చుకొనెను. మద్రాసుకు వచ్చిన పిమ్మట మూడుచుక్కల మధురచీరెను, బందరుచాయగువ్వకన్ను చీరెను, సాదారంగుచీరెలను నేను కొనియిచ్చితిని. వర్షాకాలమున మడికట్టుకొనుటకు నారమడిచీరెను పెండ్లిండ్లకు మడికట్టుకొని భోజనమునకుపోవుటకు బరంపురం వంగపండు చాయ పట్టుతాపుతాను కొనియిచ్చితిని.

తెలుగుతల్లికి తనచీరలను తానువుతుక్కొని ఆరవేసుకొను అలవాటులేదు గనుక పనిమనిషివద్దయిచ్చి వుతకమనుచుండినది. ఆ చీరెలను పనిమనిషి పేడలోను మట్టిలోను పొర్లించి రాతిమీద వుతుకునపుడు రాతికి బొక్కెనకు తగులుకొని చీరెలు చినుగుచుండినవి. పట్టుచీరెలను కట్టుకొని విందుభోజనములకుపోయి నేతిచేతులను కట్టుకొన్న చీరలకు తుడుచుకొని యింటికివచ్చి ఆ చీరనుమడిచి మొకమూలను పెట్టుచుండినది. చేతులుతుడిచిన నేతివాసనకు రాత్రిళ్లు యెలుకలువచ్చి ఆ చీరను వెయిగండ్లచీరను చేసి పోవుచుండేవి. ఆ చినిగినచీరెను సుమంగలి కట్టుకొనిన దరిద్రము వచ్చునని పనివార్లకు పంచిపెట్టుచుండినది. అప్పుడప్పుడు పాతచీరలనుయిచ్చి సూదులను, మాయపగడాల దండలను కొనుచుండినది. ఇందువలన తెలుగుతల్లికి యెప్పుడు గుడ్డలకు కఱవుగనే యుండెను. చీరెయెండలో ఆరినగాని మడికిపనికిరాదని ఈమె వాదించుచుండును. గనుక ఈమె పట్టుచీరలను మిద్దెమీద యెండవేయుటవలన రంగుపట్టు చీరలన్నియు తెల్లపట్టు తాపుతాలగుచుండినవి. తెలుగుతల్లికి అరవతల్లికివలె క్లుప్తముగ వంటచేసుకొనుటకు తెలియదు. మాకు వండిన వంటకములు మరిముగ్గురకుకూడ సరిపోవుచుండెను. మిగిలిన అన్నముతో పనిమనిషి సంసారమును, పందికొక్కుల సంసారమును కాపాడుచుండెను. ఈమె వంగవోలువంట చాలరుచిగను, పరిశుభ్రముగను చేయుచుండినది. ఆమె పోయిన పిమ్మట నాకు అటువంటి వంట కఱవైనది.

మావంగవోలాబిడకు చదువుసున్న. కుట్టుపనిరాదు. అప్పడములొత్తుట అసలే తెలియదు; గనుక ఈమె భోజనానంతరము కొంగుపరచుకొని సుఖనిద్ర ననుభవించుచుండెను.

అయితే ఈమె అప్పుడప్పుడు వంటచేయునపుడు, పచ్చళ్లను నూరునపుడు తల్లివద్ద నేర్చుకొనివచ్చిన లక్ష్మణమూర్ఛ, శీతమ్మ కడగండ్లు, కుచ్చెలకథ, పాముపాట మొదలగు పాతపాటలను పాడుకొనుచుండును. మడికట్టుకొని లక్షవత్తుల నోమునకు కావలసిన జడవత్తివిత్తులను చేసుకొనుచుండును. జపమునకు కొనుక్కొనిన పగడాల తావళమును త్రిప్పుచుండును. అరవతల్లి మంగళాంబ అప్పుడప్పుడు త్యాగయ్య కీర్తనలను పాడుచుండిన చీదరించుకొనుచుండును. సంసార స్త్రీ సంగీతమును పాడగూడదట. ఇదియే కావేరితీరమునపుట్టిన అరవతల్లికి, గుళ్లకమ్మ వడ్డునపుట్టిన తెలుగుతల్లికి భేదము.

మంగళాంబను చూచి అయినను నీవు మంచిమార్గములను నేర్చుకొనరాదాయని నేను అదలించి కోపించినప్పుడు - పొయిబొగ్గులను, పాతగుడ్డలను అమ్ముకొని పొట్టపోసకొను దరిద్రురాలిని చూచి నేను నేర్చుకొనువిద్య లేమున్నవని జవాబు చెప్పుచు కంట నీరు కార్చుచుండినది. ఎండకాలమున వడపెట్టు తగలకుండగను వడగడ్డలు రాకుండగన అంగారక గ్రహదోషనివారణకు మాయింటి పురోహితుడు కడపసుబ్బయ్యశాస్త్రికి కంది పప్పు, ఉర్లగడ్డల దానమిచ్చుచుండినది. ఫలాని ఋతువులో ఫలానిదానము లివ్వవలయునని పురోహితుడువచ్చి ఈ అమాయకురాలితో చెప్పిపోవుచుండును. ఆ పురోహితుడు నేను సమకాలికులము. ఇప్పుడుకూడ అప్పుడప్పుడు పండుగలకువచ్చి ఆచనిపోయిన మహాతల్లిని స్మరించి చేతులెత్తి నమస్కరించి పోవుచుండును.

మేము కాపురముండిన యింటిలో కొళాయిలేనందున ప్రక్కయింటి కోమట్ల కొళాయిలో మంచినీళ్లను తెచ్చుకొనుచుంటిమి. ఆయింటి శెట్టి దరిశా రంగనాథమును నేనును స్కూలులో కూడ చదువుకొనిన పరిచయముండినది. నాభార్య వారింటికి మంచి నీళ్లకుపోయినప్పుడు ఆడవారు ఈమెకు పరిచయమైరి. ఒకనాడు ఈమె వారింటికిపోయినప్పుడు మీ పేరేమమ్మాయని వారడిగిరి. అప్పుడు ఈమె తనపేరు రేపల్లె యని జవాబు చెప్పెను. ఈపేరు మద్రాసువారికి క్రొత్తగనుండుటవలన వారు పక్కునవ్వి యిదేం పేరమ్మాయని పరిహాసమునుచేసిరి. అప్పుడు శెట్టమ్మను మీపేరేమని మా ఆబిడఅడిగెను. తనపేరు కనకమ్మయని శెట్టమ్మ చెప్పుకొనెను. ఆనాటినుండి నాభార్యకూడ కనకమ్మఅనియే పేరుపెట్టుకొనినది. మద్రాసులో అందరు ఆమెను కనకమ్మ అనియే పిలుచుచుండిరి. అయితే పుట్టింటికిపోయినప్పుడు మాత్రము నామకరణమునాడు పెట్టిన రేపల్లె పేరుతోనే పిలుచుచుండిరి. నేనును ఈమెను కనకం అని తిన్నగ పిలుచుచుంటిని గాని - భర్తభార్యను పేరుపెట్టిపిలుచుట దోషమని ఈమెకు యిష్టములేకుండెను.

సాధారణముగ మద్రాసులో కోమట్లు భార్యను "యెవరాడా" అని పిలుచుచుందురు. ఒసే, ఓసి, ఏమె, ఎక్కడున్నావు, ఆబిడ, ఆఁ, ఊఁ, అను మొదలగు సంకేత నామములతో మరికొందరు పిలుచుచుందురు. కొందరు బుద్ధిమంతులు ఏమమ్మాయియని అమ్మయని పిలుతురు. భార్యలు భర్తలను పిలుచునపుడు శెట్టిగారని, అయ్యరుఅని పంతులని ఏమండిఅని, నాయుడని, మొదలియారని గౌరవనామములతో పిలిచెదరు. అయితే కొందరుస్త్రీలు భర్తపేరడిగినప్పుడు - మాప్రక్కయింటి క్రిష్ణవేణమ్మ భర్తపేరే మా ఆయనపేరుకూడ యని చెప్పెదరు. పేర్లు చెప్పకూడదనే ఆచారము యెందుకువచ్చినదో తెలియదు. పెండ్లినాడు పేర్లుచెప్పుకొను ఆచారముయొక్క అర్థమును మనవారికి తెలియ

మంగళాంబను చూచి అయినను నీవు మంచిమార్గములను నేర్చుకొనరాదాయని నేను అదలించి కోపించినప్పుడు - పొయిబొగ్గులను, పాతగుడ్డలను అమ్ముకొని పొట్టపోసుకొను దరిద్రురాలిని చూచి నేను నేర్చుకొనువిద్య లేమున్నవని జవాబు చెప్పుచు కంట నీరు కార్చుచుండినది. ఎండకాలమున వడపెట్టు తగలకుండగను వడగడ్డలు రాకుండగను అంగారక గ్రహదోషనివారణకు మాయింటి పురోహితుడు కడపసుబ్బయ్యశాస్త్రికి కంది పప్పు, ఉర్లగడ్డల దానమిచ్చుచుండినది. ఫలాని ఋతువులో ఫలానిదానము లివ్వవలయు నని పురోహితుడువచ్చి ఈ అమాయకురాలితో చెప్పిపోవుచుండును. ఆ పురోహితుడు నేను సమకాలికులము. ఇప్పుడుకూడ అప్పుడప్పుడు పండుగలకువచ్చి ఆచనిపోయిన మహాతల్లిని స్మరించి చేతులెత్తి నమస్కరించి పోవుచుండును.

మేము కాపురముండిన యింటిలో కొళాయిలేనందున ప్రక్కయింటి కోమట్ల కొళాయిలో మంచినీళ్లను తెచ్చుకొనుచుంటిమి. ఆయింటి శెట్టి దరిశారంగనాధమును నేనును స్కూలులో కూడ చదువుకొనిన పరిచయముండినది. నాభార్య వారింటికి మంచి నీళ్లకుపోయినప్పుడు ఆడవారు ఈమెకు పరిచయమైరి. ఒకనాడు ఈమె వారింటికిపోయి నప్పుడు మీపేరేమమ్మాయని వారడిగిరి. అప్పుడు ఈమె తనపేరు రేపల్లె యని జవాబు చెప్పెను. ఈపేరు మద్రాసువారికి క్రొత్తగనుండుటవలన వారు పక్కునవ్వి యిదేం పేరమ్మాయని పరిహాసమునుచేసిరి. అప్పుడు శెట్టమ్మను మీపేరేమని మా ఆబిడఅడిగెను. తనపేరు కనకమ్మయని శెట్టమ్మ చెప్పుకొనెను. ఆనాటినుండి నాభార్యకూడ కనకమ్మఅనియే పేరుపెట్టుకొనినది. మద్రాసులో అందరు ఆమెను కనకమ్మ అనియే పిలుచుచుండిరి. అయితే పుట్టింటికిపోయినప్పుడు మాత్రము నామకరణమునాడు పెట్టిన రేపల్లె పేరుతోనే పిలుచుచుండిరి. నేనును ఈమెను కనకం అని తిన్నగ పిలుచుచుంటిని గాని - భర్తభార్యను పేరుపెట్టిపిలుచుట దోషమని ఈమెకు యిష్టములేకుండెను.

సాధారణముగ మద్రాసులో కోమట్లు భార్యను ''యెవరాడా' అని పిలుచు చుందురు. ఒసే, ఓసి, ఏమె, ఎక్కడున్నావు, ఆబిడ, ఆఁ, ఊఁ, అను మొదలగు సంకేత నామములతో మరికొందరు పిలుచుచుందురు. కొందరు బుద్ధిమంతులు ఏమమ్మోయియని అమ్మయని పిలుతురు. భార్యలు భర్తలను పిలుచునపుడు శెట్టిగారని, అయ్యారుఅని పంతులని ఏమండిఅని, నాయుడని, మొదలియారని గౌరవనామములతో పిలిచెదరు. అయితే కొందరుస్త్రీలు భర్తపేరడిగినప్పుడు - మాప్రక్కయింటి క్రిష్ణవేణమ్మ భర్తపేరే మా ఆయనపేరుకూడ యని చెప్పెదరు. పేర్లు చెప్పకూడదనే ఆచారము యెందుకువచ్చినదో తెలియదు. పెండ్లినాడు పేర్లుచెప్పుకొను ఆచారముయొక్క అర్థమును మనవారికి తెలియ

కున్నది. ఆనాటినుండి మనము ఒకరినొకరు పేర్లతో పిలుచుకొనవలయుననే అర్థము. కొందరుభార్యను పేరుతో పిలుచుచున్నారుగాని భర్తను పేరుతో పిలుచుటలేదు-కొందరు చదువుకున్నవారు భర్తపేరు కాకితముమీదవ్రాసి చూపించెదరు. అరవలలో యింత పట్టింపులేదని తెలియుచున్నది.

నా గృహలక్ష్మి శుద్ధ అమాయకురాలు. పాతకాలపు పల్లెటూరిభాగ్యశాలి. ఇందుకు నేనిక్కడ మచ్చుకు రెండు ఉదాహరణములను వ్రాయుచున్నాను.

నా పల్లెటూరి పెండ్లినాడు నేను యీమెకు ఒక బంగారు చామంతిరేకుల జడబిళ్లను పెడితిని. మేము నారాయణమొదలివీధిలో కాపురమున్నపుడు ఆ జడబిళ్ల వెండిచుట్టు విరిగిపోయినది. అందువలన ఆ జడబిళ్లను పెట్టుకొనుటకు వీలుకాకుండెను. అప్పుడామె ఆబిళ్ళను తానే బాగుచేసుకొని మరల ధరించుకొనవలయుననే వుద్దేశముతో విరిగిన రెండుసగములను చింతపండుతో అతికించి యింటివీధి అరుగుమీద యెండలో సూర్యపుటముపెట్టి వీధితలుపును మూసుకొని లోపలికిపోయెను. అరుగుమీదపెట్టిన బంగారుపుబిళ్ల యెండకు తళతళమని మెరయుటను దోవనపోవు యొకపెద్దమనిషి చూచి తిన్నగ దానిని తస్కరించుకొని పరారిచిత్తగించెను. ఈమె అక్కడ దానినిపెట్టినసంగతియే మరచిపోయినది.

కొంతకాలమునకు ఆ సంగతి ఆమెకు జ్ఞాపకమునకువచ్చి పెట్టినస్థలమునకుపోయి వెతికినది. అక్కడ లేకుండెను అప్పుడు నాతో చెప్పినది.

సాధారణముగ కంసలిబత్తులు విరిగిన నగలను టంకముపొడితో (వెలిగారము) అతుకుపెట్టి కుంపటి పుటమును వేయుదురు. ఈ తల్లి చింతపండుతో అతికించి సూర్యపుటము పెట్టినది. ఈమెకు తోచిన కిటుకు యింకను కంసాలివారు గ్రహించలేకున్నారు.

నా తండ్రితిథివచ్చినది. ఆ నాడు అంగడినుంచి సత్తుతప్పెల నిండుగనెయ్యి తెచ్చితిని. నిమంత్రణ బ్రాహ్మణులు ఆకులముందర భోజనమునకు కూర్చున్నారు. నెయ్యిని వడ్డించవలయును. సత్తునేతి తప్పెలను నా భార్య పొయిమీద పెట్టినది. అది సత్తుతప్పెల అయినందున అడుగుకరగి నెయ్యి అంతయు పొయిలోపడి భగ్గునమండెను. ఆ మంట పెద్దదగుటవలన నా భార్య భయపడి దిక్కుతోచక ప్రక్కకూటములో నిలుచున్న మంగళాంబను గట్టిగకౌగలించుకొని కండ్లు మూసికొనినది. మంగళాంబ దిగ్భ్రమచెంది వంటయింటిలోకివచ్చి చూచినది. సత్తుతప్పెలకరగి నెయ్యి పొయిలో

పోయినది. ఆమె గ్రహించినది. విస్తళ్ళముందరకూర్చున్న బ్రాహ్మణులు చారలుజాపు కొని కూర్చున్నారు. అరవవారింట అప్పుదెచ్చి వడ్డించుటకు వారింట నెయ్యిలేదు. వచ్చిన నిమంత్రణ బ్రాహ్మణులు అరవవారైనందున నూనెతోనే భోజనమును ముగించు కొనిపోయిరి.

ఆనాడు మంగళాంబకూడ మాయింటనే భోజనముగనుక ఇరువురు యిల్లాండ్రు భోజనమునుచేసి తీరికగకూర్చుని తాంబూలమును వేసుకొనుచుండునపుడు మంగళాంబ గారు మా ఆబిడను ఎందుకమ్మా నీవు నన్ను కౌగలించుకున్నది-అని నవ్వుచు అడిగినది. ఆ పెద్దమంటచూచి నాకు భయముకలిగి అట్లు చేసితినమ్మాయని ఈమె దీనముగ జవాబు చెప్పెను. అయితే సత్తుతప్పెలను పొయిమీదపెట్టిన అది కరిగిపోవుసంగతి నీకు తెలియదాయని అరవతల్లి అడిగినపుడు నేను దినము ఆ తప్పెలతోనే చారుపెడుతున్నం దున పొయిమీద పెట్టితినని తెలుగుతల్లి జవాబుచెప్పినది.

ఈ తెలుగుతల్లి చాల భయస్తురాలు. రాత్రిళ్లు యింటిలో పిల్లులు చప్పుడు చేసినప్పుడు దొంగలువచ్చిరని జెప్పును. మా యింటి ప్రక్కయింటి దొడ్డిలోవున్న పెద్దరావిచెట్టు రాత్రిపూట గాలికికదలిన దానిమీద మునీశ్వరుడు (మొగదయ్యం) కూర్చుండి కదిలించుచున్నాడని భయపడుచుండెను. తెల్లవారగనే ఆ మునీశ్వరునకు పాలుపొంగలిపెట్టి మ్రొక్కుచుండును. ఇందువలన మా యింటికి మాంత్రికులు తాంత్రి కులు వచ్చి తాయెత్తులను రక్షరేకులను కట్టిపోవుచుందురు. ఈమె మెడనిండుగయివి వ్రేలాడుచుండును

ఈ విధముగ తెనుగుతల్లి సంసారమును సాగించుచుండెను. అయితే ఈ పట్టణ ములో నాకువచ్చు స్వల్పవరుంబడిలో ఈ దుబారా సంసారమును నేనెట్లు గడపగలిగి తినాయని గృహలక్ష్మి పాఠకులు సందేహపడవచ్చును. ఆ కాలమున మద్రాసులో ఇస్త్రిరి చొక్కాయి, తలగుడ్డ ధరించుకొనిన వానికి అంగళ్లలో అప్పు పుట్టుచుండినది. ఈ రహస్యము అరవలు యింకను గ్రహించలేకున్నారు.



# భరతనాట్య ప్రదర్శనము

చిరంజీవి ఆర్. ఇందిరాకుమారి 5-9-49 నాడు సాయంకాలమున మైలాపూరు రసిక రంజనిసభ హాలు నందు చక్కని భరతనాట్య ప్రదర్శన మొసంగి సభాసదులను ఆనందాబ్ధి నోలలాడించినది.



ప్రదర్శనమునకు నగరమందలి ఈ క్రింది పెద్దలు విచ్చేసిరి. రసికమణి టి. కె. చిదంబరనాథ మొదలియార్, యల్. యస్. కరియాలర్, శ్రీమతి యోగమంగళం, డా. శేషగిరిరావు కెప్టన్ నెడుంగాడి ప్రభృతులు.

నాట్య రంగము అర్హ రీతిని అమర్చ బడినది. తగిన వాద్య విశేషములు సమకూర్చ బడినది. చి॥ ఇందిరా కుమారియు తగిన వేష భూషణముల ధరించి వివిధగతుల తన నృత్యకళా విశేషముల వివరించినది.

"కంఠేనాలంబయేద్గీతం<br>
హస్తేనార్థం ప్రదర్శయేత్<br>
చక్షుర్భ్యాం దర్శయేద్భావం<br>
పాదాభ్యాం తాళమాచరేత్.

యతో హస్తస్తతో దృష్టిః<br>
యతో దృష్టిస్తతో మనః<br>
యతో మనస్తతో భావో<br>
యతో భావస్తతో రసః.

అని భరత శాస్త్రకారులు ఉత్తమ పద్ధతిని నృత్యముచేయువారి కృత్యముల నభివర్ణించియున్నారు. చి|| ఇందిర ఇందొక్కటియు పొల్లుపోకుండ అవలంబించి ద్రష్టల, శ్రోతల మెప్పువడిసినది

మొత్తముమీద 5 గీతములును 10 పదములును ప్రదర్శింపబడినవి. అందొక్కటి అమరగాయని శ్రీమతి యమ్. యస్. సుబ్బులక్ష్మి అమ్మాళ్ గారి సొమ్మైన "కాతైతూక్కి". సంగీతకళా ప్రవేశములేని అరవబాలికలరుదు. వారిలో ఈ పాట ననుకరింప యత్నింపని బాలికలును అరుదు. ఉద్యానవన విహారిణులైన బాలికలు కోకిల ననుకరించుట నైజముగదా. అనుకరించుటయే స్వారస్యము. 'ఎంతవరకుసిద్ధి' యని అడుగుట సరసము కాదు. అయితే ఈ బాలిక ప్రయత్న లోపమేమాత్రమును లేదు. సిద్ధియు అల్పస్వల్పము కాదు. ఇంతకు ఇక్కడ అభినయమునకు ప్రాధాన్యతగాని గానమునకు కాదు. బహుశా ఈ బాలికకు నట్టువొజ్జయైనవారు హెచ్చుగ 'తముళ్ ఇశై' ప్రియులని తోచెడిని. ఏలనన, ఈబాలిక నాడాలాపించిన 15 హంశములలో 'మా మోహ లాహిరి' అన్న వర్ణమున్ను, 'మధురానగరిలో' అన్న పదమున్ను మాత్రమే తెలుగురచనలు. క్షేత్రయ, సారంగపాణి మున్నగు మహనీయులు ఎన్నో ఉత్తమ పదములను నృత్యానుకూలములను రచించి సరస్వతి కర్పించియున్నారు. గీతగోవిందం, శ్రీకృష్ణకర్ణామృత మిత్యాది సంస్కృత కీర్తనలును నృత్యానుకూలములుగలవు. వానిని ఇట్టి బాలికలభ్యసించుట వారివిద్యకు, కళకు, సభాసదులరక్తికి పరిపూర్తి నొసంగునుగాని, వారిమాతృభాషాసక్తికి, అభిమానమునకు లోటు కలుగనీయదు.

చి|| ఇందిరాకుమారి 12 సం||ల బాలికయయ్యు నృత్యమధ్యమున ఆయా సన్నివేశముల కనుగుణ్యముగు హావ, భావ, హేల, లీలా, విలాస, లలిత, కిలికించి తాదులను ప్రౌఢవలె నేర్పుతో ప్రదర్శించినది. బాలిక వపుశ్రీయు, నాతిస్థూలము, నాత్యల్పమునై లావణ్య, మార్దవ, సౌందర్య సౌకుమార్యాది లక్షణలక్షితమై నృత్యప్రదర్శనమునకు తోడ్పడినది. అలంకరణ మొనర్చుపట్ల పెదవులకు లత్తుక (Lip Stick) పూయుటలో మరికొంత చాకచక్యము చూపియున్నచో బాలికకు నైజముగాగల విశాలవక్త్రము యత్కించిత్ కుంచితమై స్మిత, హసిత, విహసిత, ఉపహసితముల నింకను మనోహరముగా ప్రదర్శింప వీలై యుండెడిదేమో!

ఇంతకు ఈ బాలికకు క్రమశిక్షణ ఆరునెలల ప్రాయమేనట. ఈ సంగతి పాత్రపూర్వజన్మసంస్కారమున్నూ, నట్టువొజ్జ శ్రీ వి. ఆర్. మహాదేవ పిళ్ల గారి సామర్థ్యమున్నూ వేనోళ్ల చాటుచున్నది.

ఈ బాలిక చక్రవర్తి శ్రీయస్. టి. రామస్వామి అయ్యంగారి నాల్గవ కుమార్తె. శ్రీ అయ్యంగారు కేసరికుటీరపు కార్యాలయమున లేఖరిగానున్నారు. వీరు తమకుమార్తెకిట్టి ఉత్తమకళ నేర్పించుట ప్రశంసనీయము. ఇదియే ఆమె ప్రథమమున బహిరంగ ప్రదర్శన మొసంగుట. ఇంకనురాగల ప్రదర్శనముల ఇతోధిక నైపుణ్యము చూపునని ఆశించెదము.

ఎట్లును పెద్దఇంటి ఆడబిడ్డ సకాలమున వివాహితయై భర్తృగృహమునకు జనును. కాని ఈబాలిక ప్పుడును తానేర్చిన నృత్యకళా విశేషమును విరమించక అభ్యసించుచు పండుగ పబ్బములయందును, వివాహాది బంధుసమావేశములను కులస్త్రీలకు వెలిగాని పద్ధతిని ఆప్తబంధుమిత్ర వర్గముల మధ్యముననే ప్రదర్శింపవచ్చును అని మా అభిప్రాయము. అప్పుడే ఇప్పుడింత శ్రమకోర్చి దీనిని నేర్చినందుకు ఫలముకల్గును.






1. ఇండ్లలో, నీటికొళాయిలవద్ద, నూతులవద్ద, మరియు దమ్ముపొలములలో, సామాన్యముగ స్త్రీలే పనిచేయవలసి యుండును. సంచరించునప్పుడు కాళ్లకును, పనిచేయునప్పుడు చేతులకును కొన్నివ్యాధులు అంకురించును. శీఘ్రముగ నెమ్మదియగునవి కావు. వేదనతప్పదు. అనియేవన అరికాళ్లుపాయుట, దురద. ఇవికలిగినప్పుడు కంటిలోనినాయి, కాలిముల్లు అన్నసామెత జ్ఞాపకము వచ్చుచుండును. ఇందులకు ఒకసూక్ష్మవైద్యము కలదు. దొడ్లలోనుండు మల్లెచెట్టు ఆకులను మెత్తగనూరి పసరుతీయ వలయును. ఆపసరును ఆవసరమయినచోట్ల రాత్రులయందు రాయ వలయును.

(a) మల్లె ఆకులు సమయమునకు దొరకనియెడల గోరింటఆకును కూడ యిదేమాదిరి నుపయోగపరచు కొనవచ్చును.

(b) ఇంకొకటి:- కాచు, కరక్కాయల బెరళ్లు మెత్తగా చూర్ణమగునట్లు చేసి ఒకసీసాలో నుంచుకొని కావలసినప్పుడు కొబ్బరినూనెలో కొంచెముగాకల్పి కాలిపగుళ్ళు, పాయుట, దురదలకు నుపయోగప్పరచుకొనవచ్చును.

2. మరియు అరికాళ్లయందు ఆనెలు (కుంకుడు గింజలు) మాదిరి పెరుగుచుండును. నొప్పికూడ యుండును. నడుచుట కష్టము. అట్టిస్థలములయందు కూడ రాయుటమంచిది. చేతిగోళ్లు పిప్పిగ మారును. గోటిపయిన కొద్దిగ చీము దురద పుట్టుచుండును. ఇట్టిస్వల్పవిషయములకు పరుగు లిడుట కష్టముగాన ఇంటనుండియే యిల్లాండ్రు గృహవైద్యము చేసుకొనవచ్చును.

మామిడిటెంకలు (ముట్టెలలోనిపప్పు) మామిడికాయలువచ్చు మిడిమిడి వేసవిలో పచ్చళ్లు, ఆవకాయ, ఊరగాయలు పెట్టుకొని టెంకలను వృధాగా పారబోయుదురు. ఆటెంకల వలననే వేయుని వృక్షములై వర్ధిల్లుచుండును. టెంకలలోనిపప్పు మంచివైద్యమునకు పనికివచ్చును, దీనినే కొందరు మామిడి జీడియని కూడ అందురు. వీటిని టెంకలలోనుంచి విడదీయవలయును. పైపొరను తీసివేయవలయును. నల్లటికారు బూజుపట్టనివిగా చూచి రోటిలోవేసి మెత్తగచూర్ణము చేయ వలయును. వస్త్రకాళితము చేయవలయును. కేవలము చూర్ణము పూటకు రెండు అణాలయెత్తు చూర్ణమును నోటిలో వేసుకొని కొంచెము గోరువెచ్చని నీళ్లుత్రాగవలయును.

సామాన్యముగా అజీర్తివల్లను అలవాటులేని పానీయములు సేవించుటవల్లను, వేసవియందుకల్గు ఉష్ణభేదులకును, అకాలపు వర్షములవల్లకల్గు శీతభేదులకును మిక్కిలి ఉపయోగము. తప్పక నివారించును. ఇవి అవియని మార్పులేమియు చేయునవసరములేదు. సేవించినప్పుడు నెమ్మదించి తర్వాత మరల ప్రారంభము కానేరవు.

# ఇంటిపనులలో మెళుకువలు

## గృహలక్ష్ములకు నా మనవి

సోదరీమణులారా! మొన్న వేసవిలో మనము కష్టపడి మనమగవారిచేత ఖర్చుచేయించి ఏవేవో పచ్చళ్లు పెట్టివుంటాము. మామిడికాయలు విరివిగావచ్చేరోజులు అవేగనుక ఎవరివూహానుబట్టి వారు పెట్టివుండాలి. వాటినిమనము భద్రముగా వుపయోగించాలి. లేనిచో అవి పాడగును; మనశ్రమ, మగవారి ఖర్చు వృధాఅగును. వారివల్లచీవాట్లు, యింట్లోపిల్లలకు యిబ్బందికల్గును. ఇవేమిరాకుండా ముందుగనే జాగ్రత్తపడవలెను. వర్షాకాలమువచ్చి పడిందిగదా? ఏమాత్రం తడితగిలినా పచ్చళ్లు బూజుపట్టి, తెల్లటి తెట్టెకట్టి, పచ్చళ్లరుచితగ్గిపోవును. పచ్చళ్లుపెట్టినవెంటనే వేసవిఎండలలో 2, 3 ఎండలుచూపిన ఏమిపాడవవు. మధ్యమధ్య వర్షములు తెరపియిచ్చిన, మంచిఎండలను గుర్తించి ఒకమారు ఎండలో పెట్టవలెను. జాడీలుకాని, కుండలుకాని పొడిగుడ్డతో అప్పుడప్పుడు పైనకూడా తుడవవలెను. లేనిచో సన్నసన్నటిపురుగులు మనకు కనపడనంతటి చిన్నవిగానుండి పచ్చళ్లలోపడును. ముసురుపట్టిన సమయములో తప్పక యీసన్న జంతువులు వృద్ధిఅగును. మనకు ఎక్కువ వుపయోగముకొరకు, ఎక్కువఖర్చుచేసి, ఎక్కువగాశ్రమపడియుండుటవల్ల ఎక్కువగా దృష్టిలో పెట్టుకొని వాటినిజాగ్రత్త పెట్టుకోవడము మన బాధ్యత. చేతులతో కలుపుట, చేతులతో తీయుటవల్ల కూడా పాడగును. ప్రత్యేకముగా పచ్చళ్ళకొరకు ఒకగరిటె శుభ్రముచేసి వుంచవలెను. మధ్య, మధ్య దొరికే దబ్బకాయ, నిమ్మకాయ, చింతకాయ వగైరా వాటితో కూడా పచ్చళ్లు పెట్టుకోవచ్చు. అవికూడా చాలా వుపయోగము. జబ్బుపడ్డవాళ్ల నోటికి హితవు పుట్టించి, పైత్యము తగ్గించే గుణముకల్గి, ఆరోగ్యమును బాగుచేయును. కాని ఏపచ్చళ్లనైనా పెట్టవలెనన్న, వాటిమీదనే దృష్టిపెట్టుకొని, కాయలనుబట్టి దినుసులను సిద్ధపెట్టుకొని, కమ్మటి గానుగ నూనెతో పెట్టుకున్న చాలా రుచిగానుండును. తెలియని విషయము తెలిసికొని చేసిన చాలా మంచిది. అందరికి తెలిసి వుండదు. అందరికి తెలియక వుండదు. కాబట్టి మనము పకరి నడిగేదేమిటని, తెలిసి తెలియని పనిచేసి, మగవారి వల్లచీవాట్లు, డబ్బుదండుగ చేసుకొన కూడదు. దబ్బకాయలను, నిమ్మకాయలను ముక్కలు తరిగి, వుప్పు, పసుపులో వూరనిచ్చి, మూడవనాడు ఎండపెట్టి, ముక్కలకు తగినంతకారము కలుపుకొని, మిరప ముక్కలు, మినపప్పు, ఆవాలు మెంతులు కరివేపాకు, వెల్లుల్లిరేకలు, నూనెలో కమ్మగా వేగనిచ్చి, యిష్టమును బట్టియింగువ చేర్చి అంతా మొత్తముగా కలిపి జాడీలో పెట్టుకున్న, ఎన్నిరోజులైనా వుండి, ఎంతైనా వుపయోగించును. కూరలకంటె, పచ్చళ్లు నోటికి హితవు పుట్టించును. ప్రస్తుతములో మొక్కజొన్న పొత్తులు విరివిగావచ్చే రోజులుగాన పొత్తులతో మనము అనేకరకములుగా చేసుకొని, తృప్తిగా తినవచ్చు. బియ్యము విరివిగా కొనలేని వారికి కడుపునిండుటకు కూడా అనేకరకములుగా చేసుకొనవచ్చును. లేతపొత్తుల గింజలు వలిచి, జీలకర్ర, మిరపకాయలు, వుప్పు మెత్తగారుబ్బి, నూనెకాగగా, కరివేపాకువేసి, గింజలు వేగనిచ్చి, జీలకర్రకారము వేసి బాగుగా వేగనిచ్చి, వేడిమీద తినిన చాలారుచిగా నుండును. లేతగింజలురుబ్బి, తగినంత పంచదార, తెల్లవుప్పు కొద్దిగా కలిపి, బిళ్లలవలె నేతిలోగాని, నూనెలోకాని వేగించిన తినుటకు ఎంతోరుచిగానుండును. ప్రస్తుతపరిస్థితిలో కడుపునిండా తినవలెనన్న యీవిధముగా అనేకరకములుగా చేసుకొనవచ్చును.

---

కె. సత్యవతి






గృహలక్ష్మి సంపాదకులు డాక్టరు కే. యన్. కేసరిగారికి

**అయ్యా!** వందనములు మీరు మాసాయనగారైన శ్రీజోశ్యుల వెంకట అచ్యుతరామయ్యగారి ద్వారా నాను పంపిన పాకకళ బంగారు పతకము చేరినది. చాలసంతోషించినాను. అనేకమంది స్త్రీలకు పతకమును చూపించి మీఖ్యాతి వెల్లడి చేయుచున్నాను.

చావలి అన్నపూర్ణాభాయి.

## బంగాళాదుంపల పుష్కా

అరవీశ బంగాళాదుంపలు పెచ్చుతీసి తరిగి సమంగా వుడకపెట్టి, వార్చి పిసికి ఒకపళ్లెంలో వుంచుకొనవలెను. బాణలిలో నెయ్యి 4 తు॥ వేసి కాగనిచ్చి, 1 తు మినపప్పు 1 తు. శనగపప్పు, అరతులం ఆవాలు చిటికెడు మెంతులు, తగినంత కర్వేపాకు, పచ్చిమిరపముక్కలు అల్లంముక్కలు అన్నీ వేయించి కొబ్బరి కాయకోరివేసి 10 నిమిషములు వేయించి బంగాళాదుంపల పొడిని వేయవలెను. తగుప్పువేసి బాగా కలియబెట్టి 2 నిమ్మపండ్లరసం పిండివేసి 4 తు నెయ్యికాచిపోసి వేరేపళ్లెంలో పెట్టివాడుకొనవలెను. అన్నంలో వేసుకొన వచ్చును. విడిగాతినవచ్చును. అరటికాయ కూడా ఇదేమాదిరి చేయవచ్చును.

## సూర్యకాంతలు

2 అళాకుల వరిపిండి, 1 పడిశనగపిండి నీటితో గట్టిగా కలిపి జంతికలుచేసి నేతిలో వేయించవలెను. 1 పడి పంచదార పొయ్యిమీదపెట్టి 1 అళాకునీరుపోసి బాగాపాకం వచ్చేవరకు వుంచవలెను. ఎక్కువ వుండపాకం రాకూడదు, అప్పుడు వేయించిన జంతికలు మెత్తగా పొడికొట్టి పాకంలోవేసి, 2 కొబ్బరి కాయలు కోరినేతితో వేయించి, జీడిపప్పు 2 ఫలములు వేయించి ½ తులం ఏలకపొడి. అన్నీపాకంలో పోసి 1 అళాకునెయ్యి కాచిపొయ్యవలెను. బాగాకలియపెట్టి ఒకపళ్లెంలో పోసిముక్కలు కోయవలెను.

## గులాబిజాములు

½ వీశబంగాళాదుంపలు మంచినీటిలో వుడకపెట్టి, వార్చిపెచ్చుతీసి మెత్తగా ముద్దచేయవలెను. 2 అళాకుల మైదాపిండి 10 తు. వెన్న, బంగాళాదుంపల ముద్ద అన్నీబాగా కలిపి, దొండకాయలవలె చేసి నేతిలో ఎర్రగా వేయించ వలెను. ½ వీశపంచదార లేతపాకం పట్టి వెడల్పు పాత్రలోపోసి వేగినగులాబి జాంలు ఆపాకంలో వేయవలెను.

## చక్కెరబిళ్లలు

అరపడి వరిపిండి 2 అళాకుల గోధుమపిండి, 2 కొబ్బరికాయలకోరు కలిపిగిన్నెలో వుంచుకొన వలెను 1 పడి పంచదార పొయ్యిమీద గిన్నెతో పెట్టి 1 అళాకునీరుపోసి 10 నిముషములకు పిండినిపోసి కలియబెట్టి అరతులం ఏలకపొడివేసి 15 నిమిషములు సన్నని మంటమీద వుడకనిచ్చి దింపవలెయును. అరిటాకుమీద వుండలుచేసి బిళ్ళలువలె తట్టినేతిలో వేయించి తీసితినవలెను. చా. అ. భా.

## గోధుమహల్వా

¼ శేరు గోధుమలను మొదటిదినముఉదయము నానపెట్టి మరునాడు వానిని శుభ్రముగా కడిగి బాగుగా రుబ్బి పాలనుతీసి ఉంచవలెను. కొద్దిసేపు ఆపాలను అట్లే ఉంచిన నీరుపైకి తేలును. ఆ నీళ్ళనుపార పోసి అడుగుది జాగ్రతపెట్టవలెను.

1 శేరు పంచదారలో పావుశేరు నీళ్లుపోసి కొద్దిగా పాకమురానిచ్చి దానిలో 1 శేరు గాని లేక 3 పావుశేర్లు గాని నెయ్యిపొయ్య వలెను. తరువాత ఈపాలను అందులోపోసి పొయ్యిమీదనే ఉంచి బాగుగా కలుపుచుండ వలెను. దీనిలో ½ తులము ఏలకపొడిని, 1 తులము కిస్మిస్ పండ్లను 2 తులములు జీడిపప్పును వేయవలెను. జీడిపప్పు వేయించవలెను, కలుపుతూ ఉండగా కొద్దిసేపటికి అదిగట్టిపడును. బాగుగా గట్టిపడిన తరువాత ఒకపళ్లెమునకు నెయ్యిరాసి దానిలో ఇదిపోసి కొంచెము చల్లారిన తరువాత చాకుతో కొయ్య వలెను. ఇదితినుటకు చాలరుచిగాను బలకరముగాను ఉండును.

అ. శకుంతలాబాయి.

# బ్రతుకు తెరువు

## పథ్యామ్నాయ ఆహారపదార్థములు

గతమాసమున ఈ శీర్షిక క్రింద చిరుగడదుంపలను గూర్చి కొంత చెప్పితిమి. ఇటీవల హిందూ మున్నగు పత్రికలలో ఈ చిరుగడదుంపలతో వడలు, గులాబ్ జాం, దోశలు, బోండాలు పోళీలు మున్నగునవెన్నియో చేసి తినవచ్చునని చెప్పుచున్నారు. వీటిని తాముగా తయారుచేసి తమ అనుభవములను తెలుపుచు వ్రాయుచో ప్రకటింతుము.

### వేరుశనగపప్పు

వేరుశనగపప్పు కూడా ఇట్టి ప్రత్యామ్నాయ ఆహారము కాగలది. ముఖ్యముగా వీనిని లోపొట్టుతో కూడ నేతితో దోరగా వేయించితీసి పొట్టువలిచి ఊదుకొని తిన్నచో మంచి ఆహారము. వీనిని తిన్న పైత్యమనియు, అజీర్ణమనియు చెప్పెదరు. వీనిని ఆరోగ్యకరముగ తినుట కొక్కటే ఉపాయము. ఒక్కొక్క గింజగా తినవలయును. నోటిలో వేసుకొన్న గింజను బాగుగా నమిలి మ్రింగిన గాని మరియొకగింజ నోట వేసుకొనిచో అవి బాగుగా జీర్ణమగును. మరియు వీనిని తినుచు కొంచెము బెల్లమును కూడ మధ్య తినినచో నేమియు జబ్బుచెయ్యదు. ఇంకను వీటితో పలువిధములైన పాకములొనర్పవచ్చును.

### పప్పుండలు

బెల్లమును పాకముపట్టి, దానిలో నేతిలో దోరగవేగిన ఈపప్పును వీనితో కూడ ఎండుకొబ్బరి ముక్కలను కలిపి ఉండలు కట్టవలెను. ఒకే సైజుగా నీయుండలను తయారుచేసిన విక్రయానుకూలమగును. ఇవికొంతకాలము నిలువయుండును. పాఠశాలలకు బాల బాలికలు వెళ్ళుత్రోవలో మీయిల్లున్నచో వారికి మీయింటనివి విక్రయింపబడునని తెలిసినచో ప్రతిరోజున చేసిన వారోజున అయిపోవును. కొందరు గృహలక్ష్ములు ఇట్టిపదార్థములు చేసి తమయింటనే అమ్ముటకు భిడియపడుదురు. అట్టి వీనిని విక్రయించుటకు తగువారిని చూచుకొని వారిద్వారా విక్రయింపజేసి ఆ కొలది లాభమునే పొందవచ్చును. అయితే పరిశుభ్రముగా నీవు చేసి అమ్ముచున్నావని తెలిసినచో తల్లిదండ్రులు తమబిడ్డలను నీయింటనే వానిని కొనితినమని ప్రోత్సహింతురు.

# సామెతలు

644 అందనిపూలు దేవునికర్పణ.

645 అగ్నికి వాయువు సహాయపడినట్లు

646 అచ్చం తిరుమణివారు అయితే పుల్ల పట్టడములోనే తెలియును.

647 అచ్చివచ్చినభామ అడుగడమేచాలును.

648 అట్టయితే వైద్యకట్నాలో, ఇట్టయితే వైతరిణీ దానాలో.

649 అడవి నక్కలకు కొత్వాలు తురాయి.

650 అయితే అతడి అలాయె, లేకపోతే దాసురాలాయె.

651 అయ్యకదురువలె, అమ్మకుదురువలె.

652 అయ్యవారు అటికంత, అమ్మవారు పుటికంత.

653 అరగించగాలేనిది అడిగితే వస్తుందా ?

654 ఆరునెలలనుంచి వాయించిన మద్దెల, ఓటిదా గట్టిదా అని అడిగినట్లు.

655 ఆరెలమానుకింద, బూరెలమాను విరగబడట్టు.

656 ఆలికి అన్నం పెట్టడము ఊరికి ఉపకారమా ?

657 ఆలిని వల్లనివానికి, ఈలకూరలో ఉప్పుచాలదు.

658 ఆవగింజఅట్టెదాచి, గుమ్మడికాయగుడ్డి కానుగా ఎంచేవాడు.

659 ఆవుల సాధుత్వమూ, బ్రాహ్మణుల పేదరికమూ లేదు.

660 ఆశ ఆలిమీద, ఆధారము చాపమీద.

661 ఆశలేని కూటికి ఆకలిలేదు.

662 ఆసోదిమాటలకు అర్థములేదు, గుడ్డికంటికిచూపు లేదు.

663 ఇంటిసొమ్ము యిప్పపిండి, పొరుగింటిసొమ్ము పొడిబెల్లము.

664 ఇచ్చినవాడుదాత, యివ్వనివాడుపాత.

665 ఇల్లుఏడ్చే అమావాస్య, యిరుగుపొరుగుయేడ్చే తద్దినం, పూరుయేడ్చే పెండ్లిలేదు.

666 ఇల్లువిప్పి పందిలివేసినట్లు.

667 ఇల్లు వెళ్లిపోతానండీ అంటే, నా మాంసము యొక్కడ అని అడిగినాడట.

668 ఇల్లెల్ల మెట్టితే, తట్టెడు పెంకులు లేవు.

669 ఇల్లేతీర్థం, వాకిలే వారణాశి, కడుపే కైలాసం.

670 ఇవతలచెర, అవతలకొర, నడుమ రామరాజ్యం.

671 ఉస్తెకాయపూరసెంత, నంజపెట్టసెంత.

672 ఊరకూడు ఎన్నాళ్లు, ఉద్యోగము ఎన్నాళ్లు ?

673 ఊపిరిబట్టితే బొజ్జనిండునా ?

674 ఊరికి ఒక బోగముది ఎవరికని ఆడును ?

675 ఊరిజబ్బు చాకలి యెరుగును, ఉద్యోగపుజబ్బు బంట్రోతెరుగును.

676 ఊవాడికి కాటిభయం, పొరుగూరివానికి నీటిభయం.

677 ఎనుము తన్నునని గుఱ్ఱము వెనక్కు పోయినట్లు.

678 ఎన్నోవ్రణాలు కోసినానుకాని, నావ్రణమంత తీపులేదన్నట్టు.

679 ఎప్పటి అమ్మకు నిప్పటేగతి.

680 ఏకులు తొక్కితే బుట్ట చిరుగుతున్నదా ?

681 ఏట్లో పాకేనీళ్లు, ఎవరుతాగితేయేమి ?

682 ఏట్లో వంకాయలు కాస్తవా అంటే, కాస్తవి అన్నట్టు.

683 ఏట్లో వేసినా ఎంచి వెయ్యవలెను.

684 ఏరు అయినా మూడు నేరములు కాస్తుంది.

685 ఏరు నిద్రపోయినట్లు.

686 ఏరు మూరెడుతీస్తె, కయ్యి బారెడు తీస్తుంది.

687 ఊరివారిపసుపు, ఊరివారికుంకుమా, ఊగూగు దేవరా !

688 ఎల్లిసెట్టిలెక్క ఏకలెక్క.

689 తెలివితక్కువ అకలివిస్తారము.

690 ఒకచెయ్యితట్టితే చప్పుడవునా ?

# నెల్లూరి భక్తులు:
# కీర్తిమూర్తులు శ్రీ పిల్లారిసెట్టి కోదండ రామదాసుగారు

కీ॥ శే॥ వంగోలు వెంకటరంగయ్య పంతులుగారు

నెల్లూరి భక్తులనగ నెల్లూరియెడల భక్త్యభిమానములుగల వారనియా, లేక నెల్లూర వర్ధిల్లిన దైవభక్తులనియు నాశంక కవకాశ మగపడగలదు. ప్రాచీనులలో తిక్కన సోమయాజి యగ్రగణ్యుడగుచున్నాడు. మహాభారతమును "నాసేర్చినభంగి జెప్పి వరణీయుడ నయ్యెద భక్తకోటికిన్" (1) యని భక్తిప్రాముఖ్యతను వెల్లడించినాడు. అంతియగాక "పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక్కయారాధనా విశేషంబు"గ (2) యుపదేశించియున్నాడు. ఆంధ్రశ్లోకల్పుడగు నీసోమయాజినిగూర్చి భారతమంత గ్రంథము వ్రాయదగును. ఈ చిన్నవ్యాసము చాలదు. అర్వాచీనులలో నెల్లూర వెలసియుండు శ్రీ పల్లికొండ రంగనాయకస్వామివారి గోపుర చిత్రకూటాది గొప్ప గొప్ప కైంకర్యములజేసి శాశ్వతకీర్తిగన్న శ్రీ యరగుడిపాటి వెంకటాచల కవిపండితులు (1801-1874) ప్రశంసార్హులగుచున్నారు. "కొందఱు నెల్లూరి గొప్పవార"ను ముద్రితప్రణాళికలో వీరగ్రస్థానము నలంకరించుచున్నారు. తరువాతి గణమున నీ వ్యాసనాయకులు ప్రశంసార్హులగుచున్నారు. పైన నెల్లూరిభక్తు లనుటయం దూహింపబడిన రెండువైభవములును వీరియం దొప్పియున్నవి. పితృపైతామహముగ కుటుంబస్థావరమును వీరి జన్మస్థానమును నైన నెల్లూరియం దభిమానమును పరంపరాగత శ్రీ వైష్ణవప్రవణతయు వీరియందును వీరి రచనలయందును నతిశయించియున్నవి.

వీరి తండ్రిగారు శ్రీ వేంకటస్వామిదాసుగారు. తల్లిగారు శ్రీమతి సుభద్రమ్మగారు. వీరి కొక యన్నయు నొక తమ్ముడును యుండిరి. వారిరువురును పురుషసంతానము లేకనె పరమపదమునొందిరి.

దాసుగారి జననకాలము స్పష్టపడలేదు. బహుశః క్రీ. శ. 1816-17 లకు సరియగు యువధాతృ వర్షంబులలోనుండునని యూహింప నలవియగుచున్నది.

వీ రాదివెలమతెగవారు - వెలమతెగలో నిపుడు వెలమ, ఆదివెలమ, పద్మవెలమ లోనగు భేదములగపడుచున్నవి. వెలమశబ్ద నిష్పత్తి పరిపరివిధముల సాధింపబడుచున్నది. వర్మశబ్ద భవమునది వీనియం దొకటి. "శర్మా దేవశ్చ విప్రస్య వర్మా త్రాతా చ భూభుజః" అను ప్రాచీన వచనమొకటి యున్నందున వెలమశబ్దమునకు వర్మశబ్దము మూలప్రకృతి యగునెడల నీ వెలమలు క్షత్రియ సంప్రదాయములలోని వారను సూచన కాధారమగుచున్నది. అందుచే నీ వెలమతెగలో గొందఱికి యజ్ఞోపవీత ధారణమును నభిమతమైనది. ఆదివెలమ యనుటలో నాదిశబ్దము స్వోత్కర్ష సూచకముగ నుండగలదు. వీరిపూర్వికులలో ఆదెన్న పద్మన్న అను నిద్దరు ప్రసిద్ధసోదరులుండిరనియు వారిలో ఆదెన్న సంతతివారు "ఆది" వెలమలనియు పద్మన్న సంతతివారు "పద్మ" వెలమలనియు ఈ రెండుశాఖలవారును కాలగతిచే వేరువేరుగ పరిగణింపబడసాగిరనియు నొక యూహకలదు. మన దాసుగారి యింటిపేరే యిందుకు కొంత సహాయముజేయుచున్నది - వీరి పూర్వికు లొకరు పిళ్లారినాయుడను పేరుగలవారు వాణిజ్యవృత్తిలో నాఢ్యులై యుండి క్రమముగ నా కుటుంబమువారు పిళ్లారిసెట్టివారై యుండిరి. కుటుంబపూర్వికులలో ప్రసిద్ధులుగనుండినవారిపే రింటిపేరయినటుల అన్నితెగలందును యింటిపేళ్లగపడుచున్నవి. బ్రాహ్మణులలో అచ్యుతునివారు, రామచంద్రునివారు, వైశ్యులలో క్రిష్ణంశెట్టివారు, కాపువారిలో నల్లపరెడ్డివారు, కోటారెడ్డివారు, లోనగు యింటిపేళ్లగపడుచున్నవి.

---

(1) విరాటపర్వము 1.25

(2) ,, ,, 1.31

ఆదివెలమవారిలో గోత్రభేదములును యున్నటులెయున్నది. పిళ్లారిశెట్టివారిది కలిబుషి గోత్రమయి నటుల దాసుగారు స్వవిరచిత శ్రీరంగేశ తారావళియందును రంగపతిశతకమునందును "కలిబుషి గోత్ర జాతుఁడ"నని తెలిపియున్నారు.

ఈ తెగవారి పట్టపుపేరు తొలుత "అయ్య" "నాయడు" అని యుండినది. కోదండరామదాసు గారి తండ్రిగారిపేరు వెంకటస్వామి నాయడుగారు. తాతగారు జగన్నాథంనాయడుగారు. ముత్తాతగారు రంగయ్యనాయడుగారు. దాసుగారి పెద్దకుమారునిపేరు రాఘవయ్యనాయడుగారు. రావు నాయడను పట్టపుపేరు కడు నర్వాచీనముగనున్నది. వెలమజమిందారీ కుటుంబములలో మాత్రము "రావు" బిరుదము నాదిగ యుండినటుల గనుపడుచున్నది.

ఆదివెలమలలో శైవులు వైష్ణవులును గలరుగాని ఇరువురకును భోజన ప్రతిభోజన విషయములందును సంబంధ బాంధవ్యములందును పట్టింపులేదు. దాసుగారి కులగురువులు కాందూరివారని రంగపతిశతకము వలనను రంగనాయకశతకమువలనను తెలియుచున్నది. దాసుగారికి పంచసంస్కారములు జరిగించి తిరుమంత్ర ముపదేశించినది శ్రీమాన్ కాందూరి అప్పళదేశికేంద్రులని పైన బేర్కొనిన గ్రంథములవలన తెలియుచున్నది. వీరు తెఙ్గలె సంప్రదాయమువారు వీరు వీరవైష్ణవులయ్యు పరమతద్వేషులుగారు - వీరు తహసీల్దారుగనుండగ సైదాపురమున శివప్రతిష్ఠ జేసిరి. ఓడరేవగు కొత్తపట్టణమున శ్రీమదాంజనేయ ప్రతిష్ఠయు జరిపిరి. ఇవి రెండును ఇప్పటికినియున్నవి.

ఈ ఆదివెలమవారి ముఖ్యస్థావరము బందరు. అదియె వీరి రాజధానియనదగును. నాయని శంభులింగము నాయడుగారను నొక ఆదివెలమవారు ఈ తెగయొక్క చరిత్రను వ్రాసిరిగాని అది వారిలో నందరికి యభిమతముగాలేదు. ఆ గ్రంథమును నిపుడు మృగ్యముగనున్నది. ఊహ కలవియగునంతవరకును ఈతెగవారు వస్త్రవ్యాపారములందును అద్దకపు వ్యాపారములందును ఆధ్యులై కుంఫిణీ ప్రభుత్వమువారికి ప్రథమదశలో విశేషముగ నుపకరించిరి. "బందరు చీటిగుడ్డల"ను ప్రసిద్ధనామము వీరివలననె కలిగినది. ఉత్తరమున గంజాం జిల్లా మొదలు దక్షిణమున చెన్నపట్టణము సహా చేరిన ఆంధ్రుల యోడరేవులందంతటను ఈతెగవారు వాణిజ్య వృత్తులలో అగ్రేసరులయి గొప్పగొప్పయుద్యోగముల జేసిరి.

దాసుగారి పితామహులో ప్రపితామహులో కుంఫిణీదివాణమున నుద్యోగము సంపాదించుకొని బందరునుండి నెల్లూరుచేరి అచటనే స్థిరముగ నిలిచిపోయిరి. బందరునుండి మొదటవచ్చినవారు నెల్లూరిలో పణతు(1)లవారి వీధిలో నొకభవనము గట్టించుకొని అచటనె స్థావరము గుదురుకొనిరి. మన దాసుగారును ఆ యింటియందె జననమొందిరి. ఈ యింటికి శైథిల్యము రాజొచ్చినంతట దాసుగారు దీనికి ఎదుటనుండు కొంతస్థలమును సంపాదించి అందొక మిద్దెటింటిని కట్టించుకొని యథాసౌకర్యముగ నందు గాపురముజేయుచు స్త్రీపురుషసంతానముబొంది సుఖియింపుచుండిరి. ఈ క్రొత్తయింటి గోడలపైనంతయు విష్ణుమహాత్మ్యములను

---

(1) పణతులు = పండితులు . పండితశబ్దము కొందరు పామరజనులు పణతులని యుచ్చరించెదరు. పణతులవారను యింటిపేరుగలవారు నంబివారిలోనను శివార్చకులలోనను యుందురు. ఈ రెండుతెగలవారలకును దేవాలయకైంకర్యములుగాక వైద్యముగూడ పారంపర్యముగ వృత్తిగనుండును. ఈ వైద్యవృత్తివలన వారు పణతులవారైరి. వైద్యకుటుంబమును పండితకుటుంబమనుట యిప్పుడును మైసూరుసీమలో కలదు. అంబష్ఠులకు (మంగలవారికి) వైద్యముకూడ వృత్తిగనుండును. అందుచే నిప్పటికిని అరవమంగలవారు క్షౌరము వృత్తిగా గలిగియుండినను తమపట్టపుబిరుదు "పండితర్" అనియె చెప్పుకొందురు. ఒకనిపేరు సుందరం అనియున్నను తనపేరు సుందరపండితర్ అనియె వ్రాయును.

అవతారాదులను తెలుపు ప్రతిమల చిత్రవర్ణములలో వ్రాయించి అనవరతము సేవించుచుండువారు. తమ శయనస్థానమున కెదుటిగోడపై శ్రీ తల్పగిరి రంగనాథునిరూపమును చిత్రవర్ణములతో నలంకరింపజేసికొని తద్దర్శనమును ధ్యానమును ఆరాధనమును జేసికొని అనుభవించుచుండెడివారు. దాసుగారిమనుమలలో అనివార్యమగు వ్యాజ్యెముసంభవించి తత్ఫలముగ నీయిల్లు పరాధీనమైపోయినది. అట్లు స్వాధీనముపొందిన వారును ఇతరులపరముజేసిరి. ఇపుడా మిద్దెటింట శ్రీకుసుమ హరనాథస్వామివారి మందిరమేర్పడి భగవద్భావ యుక్తప్రచారములకే నిలయమైనది. పితృపైతామహమగు యింటిపట్టుస్థళమున నెల్లూరిమునిసిపాలిటివారు కొంత కాలము కూరకాయలనిమద్య (మార్కెటు) సాగించిరి. ఈవల మార్కెటు యెత్తివేయబడి బయలుస్థళము దాసుగారి మనుమలగు రావు సాహెబు శ్రీ మన్నాథరావునాయడు గారిదై యున్నది.

దాసుగారి భార్యగారిపేరు శ్రీమతి వేంకటరంగమ్మగారు. ఈమె గంజాంజిల్లాలో ప్రఖ్యాతులై యుండిన నానిసెట్టివారింటి యాడబుట్టువు.

ఈ దంపతులకు ముగ్గురు కుమారులును ముగ్గురు కూతుండ్రును గలిగిరి. పెద్దకుమారుడు వంశకర్తయగు రాఘవయ్యనాయడుగారు. మిగిలిన యిద్దరిలో పెద్దవాడు వివాహములేకనె గతించినాడు. మూడవవాడు వివాహితుడై సంతానముపొందకనె తండ్రిగారుండగనె పరలోకగతుడైనాడు. రాఘవయ్యనాయడుగారు మెట్రిక్యులేషన్ పరీక్షనిచ్చి ఆంధ్రగీర్వాణములం దొకపాటి సాహిత్యమును సంపాదించుకొని నెల్లూరియం దును వంగవోలునందును మద్రాసునందును క్రైస్తవపాఠశాలలో నుపాధ్యాయులుగనుండి కీర్తిగడించిరి. వీరును శ్రీ పల్లికొండ రంగనాయకుల భక్తులు. అనుదినము శ్రీ స్వామివారిసన్నిధిసేవకు పోవుచుండువారు. వీరిభార్య కొప్పిసెట్టివారింటి యాడబుట్టువు. చాలకాలము నెల్లూరిలో హిందూహైస్కూలు ప్రధానోపాధ్యాయులు (హెడ్డుమాస్టరు)గనుండి తెలుగున ప్రసిద్ధ సాహిత్యపరులుగనుండి మద్రాసు యూనివర్సిటీయందు బి. ఎ. పరీక్షాదులలో ప్రధానపరీక్షకులుగను నుండిన సౌమ్యమూర్తులు కీర్తిశేషులు శ్రీ కొప్పిసెట్టి వేంకటరామానుజ రావునాయడు బి. ఎ. గారి యనుంగు సోదరియగు శ్రీ పెరిందేవితాయారమ్మగారు. ఈ జాయాపతులకు నలుగురు కుమారులును నలుగురు కుమారితలును గలిగిరి. మొదటి యిద్దరు కుమారులును చిన్నతనముననె గతించిరి. మూడవవారు పెద్దపెరిగి వివాహములేకనె పరమపదముజెందిరి. నాల్గవవారగు శ్రీమన్నాథరావు నాయడుగారు వివాహితులై వంశకరులైయున్నారు. వీరికొక కుమారుడును కుమారితయుగలరు.

దాసుగారిది సంపన్నకుటుంబము. సర్కారుఉద్యోగములేగాక గొప్పగొప్ప బాడుగలువచ్చు అంగడికొట్లు నెల్ల్యూరి నడిబజారులో పది పండ్రెండు వీరికిగలవు.

గడచిన ప్రపంచయుద్ధములో దేశమునందంతటయును అన్నవస్త్రములకు మహాక్షామమేర్పడి దేశము తల్లడించుచుండగ మన్నాథరావునాయడుగారు నెల్ల్యూరిలో అశనవసన క్షోభమంత తీవ్రముగ వ్యాపింపకుండ యుక్తమగు నేర్పాట్లుజేసి లోకక్లేశమును నివారించి లోకక్షేమమునకై గొప్పపాటుపడిరి. కడునేర్పుతోడను మెలకువతోడను దుర్ఘట పరిస్థితుల నిరపాయముగ దప్పించిరి. ఇందుకు శ్రీ గవర్నమెంటువారు మెచ్చి 1916 జనవరిలో "రావు సాహెబ్" బిరుదమున వీరి నభినందించిరి. వీరు తహసీల్దారుగను జిల్లాకలెక్టరువారి శిరస్తాదారుగను ఉద్యోగములజేసి కీర్తిపరులై 1916 నందె పించనుసహాపొంది నెల్ల్యూరియందే పితృపైతా మహాశయముల యెడల నశిథిలమగు భక్తిశ్రద్ధలతో సుఖజీవనము జేయుచున్నారు.

కోదండరామదాసుగారు ఒడ్డుపొడవుగల దృఢగాత్రులు. దేహచ్ఛాయ నలుపు. వర్చస్సుతేజ స్వంతము. స్ఫురద్రూపము. విశాలఫాలము. వక్షస్సువిశాలమైనవి. దీర్ఘబాహులు - ద్వాదశోర్ధ్వ పుండ్రముల ధరించుచుండువారు. వారినిమాడగనె ఇదియొక విలక్షణవ్యక్తియని తోపగలదు. భుజనకు వెడలు నపుడు బంగారు మొలత్రాడును రెండుచేతులకు సింహతలాటముల బంగారు మురుగులు సందిట బంగారు

చంద్రవంకబిళ్లయు, ప్రేళ్ళయుంగరములును ఇత్యాద్యలంకారముల ధరించి, పట్టుపీతాంబరములధరించి, పగడాల హారములు తులసిపూసల దండలు ధరించి, కాళ్లకు మెండుగ గజ్జలగట్టుకొని, తోడు పాడువారిని కొందరి నేర్పరచుకొని బయలువెడలుదురు. వీరు సుఖపురుషులు. తాంబూలప్రియులు. వెండితాంబూలకరాటమును చేతబుచ్చుకొని చల్లగాలికి పెత్తనమున బజారువీధియందిటునటు కొలదిగ సంచరింతురు. భజనకాలమున వార్ధక్యము నావలబెట్టి తంబురయు కరతాళములను చేతబట్టుకొని నవయౌవనుని మాడ్కి బహులాఘవముతో నృత్యముజేయుదురు. ఈ లేఖరి వీరిని బాగుగ నెరిగినవాడు.

దాసుగారిరువదేండ్లప్రాయమునకె సర్కారుద్యోగమున ప్రవేశించిరి. ఇరువదియైదేండ్లు ఉద్యోగ ధర్మముల నడపి తహసీల్దారు పదవికెక్కిరి. వీరచట యుద్యోగమునసున్నను ముక్కోటిఏకాదశికి సెలవు పొంది నెల్లూరికివచ్చి శ్రీ స్వామివారి సేవాకైంకర్యముల నిర్వర్తించుచుండిరి. ఒకసంవత్సరమున ముక్కోటికి సెలవు లభింపనందున యుద్యోగముపై విసుగుగొని విరక్తిగొనిరి. వీరికప్పటికె కంటిజబ్బును అంకురించి-యుండినది. ఆ నెపమున వీరుద్యోగమును చాలించుకొని పూర్తిపించనుకు నియుక్తకాలము నిండనందున మూడవవంతు పింఛనుబొంది నెల్లూరుజేరి స్వగృహమునను, శ్రీ రంగనాయకస్వామి దేవాలయమునను భగవత్కైంకర్యముల నిత్యానుసంధానముజేయుచు ఆయుశ్శేషమును భగవదర్పణముజేసి శ్రీవైకుంఠమున భగవత్సాన్నిధ్యమునందిరి. వీరు పింఛను పొందినవిషయము నొక కీర్తనయందుదాహరించియున్నారు.

పున్నాగవరాళి - ఆదితాళము

ఎంతో హోదాను వదలుకొంటి నీ భజనకై - మూడో
వంతు పించను దెచ్చుకొంటి నీ పరమార్థముకై
ఎంతవేడిన బల్కవు నీకా నింతట ఓడిచెదనంటె
మంత్రమహిమో, మరులుమందో, మచ్చుచల్లితివో గాని.

ఇట్లనుదిన మహర్నిశము భగవద్భజనయందు నిమగ్నులై భగవన్నామస్మరణమున కాలక్షేపముజేయుచు ప్రేమభక్తిస్వరూపులైన శ్రీ పిళ్ళారిసెట్టి కోదండరామదాసుగారు గడచిన వికృతినామసంవత్సర ఫాల్గుణ శుక్లాష్టమీ మంగళవారమున ఇష్టదైవమగు శ్రీ తల్పగిరి రంగనాయకస్వామివారి బ్రహ్మోత్సవ మప్పటి కాసన్నమైయుండగ ఆబ్రహ్మోత్సవవైభవమును సాక్షాత్తుగ నఖిలనిత్యసూరిమండల మధ్యగతులై పూర్ణాంశములతో భాసించుచుండు శ్రీమన్నారాయణుని నిజస్థానమున సేవింపగల కోరికతో శ్రీ వైకుంఠమందిరము జేరి బ్రహ్మానందము ననుభవించుచున్నారు. అది క్రీ. శ. 1891 సంవత్సర మార్చి 17 ది అగుచున్నది.

(సశేషము)



# గృహలక్ష్మి పద్యరత్నములు

నిన్ను, నీపాపను దా మన్నించియుఁ బురుడుదీర్చు మహిళామణి, కీ
వెన్నిచ్చియు, ఋణభారముఁ దిన్నగఁ దీర్పంగలేవు; ధీగృహలక్ష్మీ!

మైమఱచి, నిద్రఁజెందెడి నీమత్తు గ్రహించిదాది, నీపాపను, నిర్
బ్రేమమున, నహర్నిశమును సేమంబున రక్షసలుపు; శ్రీగృహలక్ష్మీ!

పురుటింట నఖండంబును బురడింపగవలయు; దీనఁబోలుచు శుభంబుల్
పురుటాలవు మఱవకుమా! పురాతనపు వచనమిదియబో; గృహలక్ష్మీ!

కాఁదారి పూఁట గ్రహములు వాదాడుచు వచ్చిపోవు బాలలకొఱకై
శ్రీదీపముఁ గాంచినచో వేదనఁబడి వెళ్ళిపోవు; ప్రియగృహలక్ష్మీ!

పదిదినములెట్లొ గడచెను పదియవదగు నాటిరాత్రి పద్మాక్షులు, మీ
సదనంబుఁ జేరి పాటల ముదమునఁ బాడెదరు; తెలియుమో గృహలక్ష్మీ!

'అమ్మా! మీకూతురు, సేమమ్మె? శుభమ్మె కొమరునకు? మంగళస్నానం
బిమ్మన రేపేగద' యను కొమ్మల ప్రేమమ్ముఁ దెలిసికో! గృహలక్ష్మీ!

'అమ్మా! మీదయచేతను కొమ్మ సుఖమ్మున్నదమ్మ; కొమరుడు సౌఖ్యం
బమ్మా! మీరందఱు ప్రేమమ్మున వేంచేసి రేపు' మాగృహలక్ష్మీ!

'మంగళస్నానము దీర్పుడు రంగుగ జామాత రేపు రావచ్చును, శ్రీ
రంగని దయచే' యను మీయంగన వాక్యముల వింటివా? గృహలక్ష్మీ!

తాంబూలముచేఁ బట్టియు 'అంబా! నీ ముద్దుకొడుకు హాయియె? నీకుఁ
సంబరమే? యనియడిగెడి బింబోష్ఠులఁ బ్రీతిఁ గనుము; ప్రియగృహలక్ష్మీ!

నీరజమిత్రుఁడు పొడిచెను ; నీ వాడియు నొడలు దుడిచి నీ గోరులకున్
గోరంటాకులఁ బూయుము; పారాణిని మఱవకమ్మ; ప్రాగృహలక్ష్మీ!

చిఱుతకు నూనెను బెట్టిరి; తెఱవలు చిఱుబంతి పసుపు తెమలిరి యొడలన్
అఱిముఱి పాటునసీరము చిఱునవ్వునఁ బోసిరమ్మ; శ్రీ గృహలక్ష్మీ!

కనులకుఁ గాటుకఁ బెట్టుము; కనుపండువుగాఁగఁ జీరఁగట్ట గదమ్మా!
యనువునఁ దిలకము దీర్పుము ; జనఁగునుపుము బాలకునకు ; జయ గృహలక్ష్మీ?

(పశీవము) క. అ. రావు.

# నిర్మల

★ గోలేటి శ్రీ జగన్మోహనరావుగారు

"ఛీ! సిగ్గులేదూ ... నాతో మాట్లాడొద్దని ఎన్నిసార్లు చెప్పాలి!" — ఈమాటలు జ్ఞాపక వచ్చినప్పుడల్లా అతని హృదయం పట పట కొట్టుకుంటుంది. అయిదు సంవత్సరాల క్రితం విన్నమాటలవి. నిర్మల అత న్నంత త్రుంచేసి మాట్లాడుతుందని ఎన్నడూ అనుకోలేదు. లేకపోతే ఆ అమ్మాయితో మాట్లా డక పోయేవాడే ... "అయినా ఎప్పటి సంగతో జ్ఞాపకం చేసుకోవడం ఎందుకు" — అనుకొని ఎంత మరచిపోదమన్నా మరపు రావటం లేదాయే ... ఆ అమ్మాయిమీద అంతమోజు ఎందుకుండేదో అతనికి అర్థం కాలేదు ... ఇప్పుడు కూడా అతనికి నిర్మలంటే ఎంతో గౌరవం. నిర్మలచేత ఎన్నోసార్లు అవమా నింపబడ్డాడు ... ఎప్పుడూ అతణ్ణి నిరసించి మాట్లాడుతూండే దా అమ్మాయి ... అయినా నిర్మలంటే ఎందుకో అంతప్రీతి? ... నిర్మలలో ఏదో ఒక చెప్పలేని శక్తివుంది. ఆకళ్ళల్లో ఏదో దివ్యజ్యోతి మిల మిల మెరుస్తూంటుంది. పద్మం వంటి ఆముఖంలో ఎప్పుడూ ఒక కాంతి వెలుగుతూంటుంది ... అందుకే నేమో మనోహరం ఒక్కొక్కప్పుడు నిర్మలని చూస్తూ చాలా నిమిషాలదాకా అచేతన వస్తువులా నిలబడి పోయేవాడు !

♦ ♦ ♦

మనోహరం తండ్రి రాజమహేంద్రవరంలో ఎన్నుకోతగ్గ మనిషి. ఆ కుటుంబం దరిద్రానికి ఆవాసం. దరిద్రాన్నైనా దర్జాగా అనుభవించాడు చాలారోజులు. నక్షత్రం తిరిగింది. అదృష్టం తన్నుకొచ్చింది. ఇప్పు డతన్ని ధనవంతుల జాబితాలో చేర్చారు. ఊరికి కొంచందూరంలో ఒకసామాన్యమైన బంగళా కట్టించాడు. ధనాన్నిబట్టి తెలివితేటలు కూడా రాణింపుకొచ్చాయి.

చిన్నప్పటినుంచీ మనోహరానికి మొక్కలు పెంచటం అంటే చాలాకుతూహలం. అంచేతే ప్రత్యేకశ్రద్ధ తీసుకుని బంగళాచుట్టూ ఎన్నో మొక్కలు పాతించీ, పందిళ్ళమీదకి లతల్ని పాకించీ రోజూ వాటికోసం ఎంతో కష్టపడుతూండేవాడు. తెల్లారగానే మేడమీది కిటికీలోంచి తనమనోహరమైన తోటని చూసుకుని మురిసిపోతూండేవాడు. మనోహరం అదోరకం మనిషి. అతని స్వభావం అర్థం చేసుకోవటం కష్టం. ఒక్కొక్కప్పుడు నిర్మలమైన ఆకాశాన్నిచూస్తూ గంటలతరబడి అల్లానుంచుని పోయేవాడు. "ఈమనోహర ప్రకృతికి నేను దాసుణ్ణి; ఈ సౌందర్యాన్నిచూస్తూ ఇలాతన్మయత్వంలో మునిగి ఆనంది స్తాను" అనేమాటలు అప్పు డప్పుడు జారుతుండేవి అతని పెదవుల మధ్యనుంచి. అందంగావున్న ఏవస్తువు కనిపించినా చూస్తూ పిచ్చివాడిలాగ అలానుంచుని పోయేవాడు. ఎంతోమంది అతని స్వాభావం మంచిదికాదనీ, మనోహరం చెడ్డవాడనీ అంటూండేవారు ... "నా హృదయం నిర్మలం. సౌందర్యం ఎక్కడవున్నా ఆస్వాదించి ఆనందిస్తాను. ఇందులో ఏమాత్రం తప్పులేదని నా దృఢనమ్మకం" అన్న అతడి భావాలు ప్రజల అభిప్రాయాల్ని గడ్డిపరకగా చూడసాగాయి. అలాగే కాలం సాగుతూండేది.

నిర్మల తండ్రి అవూళ్ళోనే గొప్ప ఉద్యోగస్తుడు. లక్షలాదిగా ధనం వుంది. ఒక్కత్తే కూతు రవటంచేత నిర్మలని ఎంతో గారాబంగా చూసేవాడు. ఇంట్లో నిర్మల, వీధులో తన ఆఫీసుపని వీటితో తప్ప ఆయనకి మరోదాంతో ఎక్కువ సంబంధముండేది కాదు. నిర్మలతల్లీ మనోహరంతల్లీ తరుచు కలుసు కుంటూండేవాళ్ళు. వాళ్ళిద్దరికీ ప్రాణస్నేహంకూడాను. నిర్మలకి మనోహరంతల్లంటే ఎంతో గౌరవం ప్రేమానూ. ఇళ్ళురెండూ ఎదురెదురుగానే ఉండటంచేత నిర్మలకాలేజీనించిరాగానేవీళ్ళింటికి చక్కావచ్చేది. "లలితమ్మగారూ" అంటూ ఆపాటికి మనోహరం కూడా యింట్లోనే ఉండేవాడు. కాలేజీ లెక్చర్లతో విసిగెత్తి విసిగెత్తి యింటికి రాగానే పందిరికింద చల్లగాలిలో కూనిరాగాలుతీస్తూ కూర్చునేవాడు ఆకాశం కేసిచూస్తూ. కాని నిర్మల రావటం వెళ్ళిపోవటం రెండూ కూడా చాలా దీక్షగా పరికించేవాడు. అతన్ని అచలత్వంలోంచి చంచలింప చేయగల సౌందర్యరాశి నిర్మల మాత్రమే.

నిర్మల అతణ్ణి చూసినతక్షణం పిచ్చాడికింద కట్టేయటంచేత ఆ అమ్మాయికి అతనంటే ఏమాత్రమూ గౌరవం వుండేదికాదు. నిర్మల మొదట మనోహరాన్ని కలుసుకున్నది వాళ్ళహాల్లోనే అప్పుడు మనోహరం. చినిగినలాగూ తొడుక్కుని, చొక్కాలేకుండా అష్టకష్టాలూపడుతూ తనసైకిల్ని మరమ్మత్తు చేసుకుంటు న్నాడు. ఈహడావిడిలో నిర్మలవచ్చిన ఉనికే తెలియలేదతనికి. నిర్మలకాస్సేపు నుంచుని అతనివేషం వాల కంచూసి కిలకిలనవ్వి వెళ్ళిపోయింది. పాపం వెంటనే మనోహరం ఆ అమ్మాయిని చూసి "లోపలికి వెళ్ళవచ్చునండీ" అన్నాడు గూడాను. కాని "ఫరవాలేదులెండి. సైకిలు సంగతి చూడండి. నేను మళ్ళీ వస్తాను" అన్నమాటలు గబగబ రాలాయి. అతను నిర్ఘాంత పోయాడు.

తననిచూసి ఆ అమ్మాయి నవ్వడానికి కారణం ఏవిటి? నేనేమైనా విపరీతంగా కనిపిస్తున్నానా? అనుకుని వెంటనే అద్దందగ్గరనుంచుని చూసుకున్నాడు తన రూపురేఖలు; ముఖంనిండా నల్లటి మరకలు, చొక్కాలేని వళ్ళూ, చిరిగిపోయిన లాగూ తనకే ఛీ అనిపించింది. దవడమీద ఒకలెంపకాయి కొట్టు కున్నాడు. తనలో అందం అనేది లేదేమో... అందుకే ఆసుందరి అలానవ్వింది. తనయింటికి వచ్చినప్పుడు నిర్మలనిచూడ్డం అదే మొదటిసారి... కాదు కాదు; నిర్మలకి తననిచూడ్డం అదే. మొదటిసారి — అతను ఆ అమ్మాయిని చాలాసార్లు చూశాడు. తన అంతర్యంలో ఏదో ఒక అవ్యక్తమైన భావం చలిస్తూండటం మొదలుపెట్టింది కూడాను కొద్దిరోజుల్నుంచీ; ఆభావం అతనికి పూర్తిగా అర్థం అవకుండానే నిర్మల అతనికళ్ళకి గోచరిస్తూంటుంది. అది నిర్మలమీద అతనికిగల గౌరవం అన్నాసరే లేక స్నేహభావం అన్నాసరే. నిర్మల అన్నపేరు నిజంగా అతన్ని ఊపేస్తుంది. దానికి కారణం చెప్పడంమాత్రం కష్టం.

ఇంకా నాలుగైదు సార్లు కూడా నిర్మల వాళ్ళింటికి వచ్చినప్పుడు అంతకంటె అసహ్యమైన దుస్తులతో సామాను సర్దుతూనో, పిచ్చిపాట పాడుతూనో ఆ అమ్మాయి కంట పడ్డాడు. నిర్మల అతనికేసి చూసి వెంటనే తలదించుకుని నవ్వుకుంటూ లోపలికి వెళ్ళిపోయేది. అప్పుడు అతడిహృదయం దహించుకు పోయేది. రాత్రంతా నిద్రపట్టేదికాదు. తనొక సామాన్యజీవి. తనలో విశేషమైన గుణాలేవీలేవు. "మనోహరం చాలాఅందమైనవాడు" అని తనబంధువులనోటివెంట అక్కడక్కడవిన్నా ఆ మాటల్లో అతనికేమాత్రం నమ్మకంలేదు. కనక తను అందగాడుకూడా కాదు. అందుకే నిర్మల తనకేసి చూడదు. అందుకే నిర్మలకి తనంటే అంతహేళన. ఈ ఆలోచనతో అతనిబుద్ధి తిరిగిపోతూండేది. "అవును. నా అంతవాణ్ణినేను. నిర్మలంతటిది ఆ అమ్మాయి. నాగౌరవంనాకుంది. ఆ అమ్మాయిగౌరవం ఆ అమ్మాయికుంది. నన్నుచూసి ఎందుకు నవ్వుకోవటం?" ఆ అమ్మాయి తన్నిచూసినప్పుడల్లా ఎందుకు అల్లా లోపల లోపల నవ్వుకుంటుంది? ఈసారి యీమాటతప్పకుండా అడిగెయ్యాలనిపించేదతనికి. నిర్మలంటే చాలాకోపంకూడావచ్చేది. మళ్ళీ ఎక్కడలేనిగౌరవం అతనికి నిర్మలంటే. మనస్సుని ఎంతతడివినా కారణం కనుపించదు. ఇదిచాలా ఆశ్చర్యంఅని తనే అనుకుంటూండేవాడు.

తరవాత తరవాత నిర్మల వాళ్ళింటికి తరుచు రావటంమూలాన్ని కాస్సేపుమాట్లాడి ఆకోకిలస్వరాన్ని విని ఆనందించాలని కుతూహలంగా ఉండేదతనికి. అయిదారుసార్లు ఆ అమ్మాయే మాట్లాడవలసొచ్చి మాట్లాడిందతనితో. అందులోనూ కరకుతనం నిరసనభావం లేకపోలేదు. అయినా నిర్మలతో మృదువు గానూ, మధురంగానూ మాట్లాడదామనే ప్రయత్నించాడతను. కర్మంచాలక మాట్లాడినా నిర్మల తలవంచు కునే మాట్లాడేదిగాని తలెత్తి అతన్నిచూడనైనా చూసేదిగాదు. అదీ మంచిదే అనుకునేవాడతను ఆమె దివ్యసుందరవిగ్రహాన్ని క్రిందినుంచి పైవరకూ తనకళ్ళతో కొలుస్తూ. ఇలా కొన్నాళ్ళుగడిచినై. మరి కొన్నిసార్లు ఆ అమ్మాయిని తనే మాట్లాడించడానికి ప్రయత్నించాడు. ఒకటి రెండుప్రశ్నలకి కరుకైన సమాధానంతప్ప మరేం మాట్లాడేదికాదు నిర్మల. చాలాసార్లు తనతో మాట్లాడొద్దనీ తనకి కోపంవస్తుందనీ కూడా సూచించింది. ఇలాంటి మాటలన్నీ మనోహరం మనస్సులో బాగామథింపబడి చివరికి మాయ మౌతుండేవి. మళ్ళ యథాప్రకారమే. మర్నాటినుంచీ ఇలా కొంతకాలంసాగింది.

అవాళ దీపావళిపండగ. అన్నియిళ్ళూ దీపాలవరసల్తో కలకలలాడుతున్నాయి. పండక్కి మనోహరం చిన్నతమ్ముడు వాళ్ళమామగారి ఊరెళ్ళాడు. తల్లి నిర్మలగారియింటికి వెళ్ళింది అయిదునిమిషాల క్రితం... ఇంట్లో లైటువేసుకుని పత్రికచదువుతున్నాడు మనోహరం. తండ్రి యింకా యింటికిరాలేదు. గుమ్మందగ్గిర ఏదో తళుక్కునిమెరిసింది. మనోహరం ఒళ్ళు గగుర్పొడిచింది. విద్యుల్లతలాగ మెరిసిపోతోంది నిర్మల. ఆ ఆకాశరంగు చీరలోంచి మిలమిల మెరుస్తోంది నిర్మల స్వర్ణదేహం కొన్నిచోట్ల .. నిర్మల నిజంగా ఒకదేవతాస్త్రీ...వర్ణించడానికి మాటలుచాలవు...“ అమ్మ యింట్లోలేదు...” అన్నాడు మనోహరంమెల్లిగా... కాని దృష్టంతా నిర్మలమూర్తిమీదే లయమైవుంది. నిర్మల యీమాటవినిపించుకోకుండానే యింట్లోకివెళ్ళింది... మళ్ళీ నిర్మల ఎప్పుడువస్తుందా మాట్లాడుదామా—అని మనోహరం ఊపిరిబిగబట్టి తదేకదృష్టితో నిర్మల రాకకోసం ఎదురు చూస్తున్నాడు. హృదయం యిప్పుడతని వశంలో లేదు. టపటప కొట్టుకుంటూన్న శబ్దం ఏదో తనలోంచి వినిపిస్తోందతనికి. లలిత యింట్లో ఎక్కడా లేకపోవడం మూలాన్ని మళ్ళీ శరవేగంతో హాల్లోకివచ్చింది నిర్మల.

“నేను చెప్పానుకదూ అమ్మలేదని...వెళితే మీయింటికే వెళ్ళుండొచ్చు ... దీపావళి హడావిడేవిటిదంతా?” ఇన్నిమాట లెలా అనగలిగాడో అతనికే అర్థం అవలేదు. ఆతురతతో సమాధానంకోసం ఎదురు చూశాడు.

“ఛీ—సిగ్గులేదూ...ఎన్నిసార్లుచెప్పాలి నాతో మాట్లాడొద్దని!” పిడుగుల్లా రాలాయి యీ అక్షరాలతనిమీద...నిర్మల మెరుపులా మాయమైంది. నిర్మలని వెంటనే ఖూనీచెయ్యాలనిపించిందతనికి. తక్షణమే కుర్చీమీంచిలేచాడు ... ఛా! వెధవహృదయం — ఒకఆడది వివక్షతలేకుండా అన్నమాటలకి తనలో అంతచలనమా ... మనస్సులో ఒక తుఫాను రేగినంత హడావిడా...వెంటనే మళ్ళీకుర్చీలో కూలబడ్డాడు. బుఱ్ఱ గిఱ్ఱుమని తిరిగిపోతూంది... తనేమైనా తప్పుమాటఅన్నాడా? అసలు మాట్లాడడమే తప్పుకదూ? ఏవిటో? అంతా అయోమయంగా వుందతనికి ... తనుమాట్లాడినంతమాత్రాన సిగ్గుమాలినవాడయ్యాడా? ఈ మాట సహించడం ఎలా? నిర్మలలో మానుషత్వంలేదు — నిర్మల పశువుకాదు... నిర్మల దేవత—తనేపశువు. లేకపోతే నిర్మలచేత ఎందుకు తిరస్కరింపబడాలి? ఏవిటో అంతా గోలగా వుందతనికి. సౌందర్యమే అతనికి ముఖ్యమైనవస్తువు. తను అందంగాలేడు కనక నిర్మల అలాకరుకుగా మాట్లాడగలిగిందనే భయం అతన్ని కలతపెట్టేస్తుంది...అవును తను అందంగాలేకపోతే నిర్మలంతటిసుందరి తనని ప్రేమించడంఎలా? ప్రేమించాలి! అదేంమాట? .... ఏదో కొత్తభావం ఉద్భవించినట్టయిందతని మనస్సులో నిర్మల తనని ప్రేమించాలని యిదివరకెన్నడూ తనుకోరినట్టులేదే ... ఎప్పుడూ అనుకున్నట్టుకూడా లేదే? ఆ విషయం! మళ్ళీ అంతాచిక్కుగా కనిపించిందతనికి ... ఒక ఆలోచనకాదు. ఒకభావంకాదు. హృదయంఅంతా అదిరిపోతోంది.

ఇంతహడావిడైనా చివరకి నిర్మలంటే గౌరవంమిగిలిందతని మనస్సులో. అతనికే చాలా ఆశ్చర్యం వేసింది. ఛక్కునినవ్వాడు ఒకసారి. అదే ఆఖరిసారి అతనికి నిర్మలనిచూడ్డం. నిర్మలరూపం యింతకుముందే గాఢంగా హత్తుకుందతని హృదయంలో...ఇప్పుడు మరీ స్ఫుటంగా నాటుకుంది ఆమూర్తి...మనోహరం చదువుమీద కలకత్తావెళ్ళవలిసొచ్చింది, తనమామగారింటికి...మరినాలుగుసంవత్సరాలకి కలకత్తావదిలి బెంగుళూరువచ్చాడు చదువుమీదే.

పాపం కలకత్తాలో ఒకకారు కిందపడి తలమీద ఒకగాయంతిన్నాడు. అదితర్వాత బాగా నిమ్మళించినా ఒకనాటుమాత్రం చిహ్నంగా వుండిపోయింది... మనోహరం యిప్పుడు పూర్తిగా మారిపోయాడు. ఆగాయంతో మనిషిలో మరీ మార్పొచ్చేసింది. నవనవలాడేముఖం చిన్నప్పుడే అందమైందేమో యిప్పుడు మరీ శోభావంతంగావుంది. నుదుటిమీదవున్న ఆ నాటుకూడా అతనిసౌందర్యానికి దోహదం అనేచెప్పాలి. ఆ అంగసౌష్ఠవం! ఆ విశాలవక్షస్థలం! అతను నిజంగా సౌందర్యమూర్తి. నడకలో ఒకఠీవి, చూపులో ఒక ఆకర్షణశక్తి, మాటలో మాధుర్యం తొణికిసలాడుతున్నా యిప్పుడు. (సశేషము)



# రేడియో

## జోలలు  శ్రీమతి కామరాజు మైత్రేయిగారు

జోలల్లు బాడితే బాలులకు నిద్ర
నాగస్వరము బాడితే నాగునికి ఆట.

అన్నట్లు ఎంతచిన్నబిడ్డఅయినా, జోలలుపాడితే, ఏడ్పుచాలించి నిద్రపోతుంది. ఈజోలపాటలనేవి ప్రతిదేశములోను వున్నయి. ఆ యాదేశకాలపాత్రములను అనుసరించివుంటాయి వారిజోలలు. ఎవరిదేశానికి తగినట్లు వుండడమేకాకుండా ఎవరిఅంతస్థుకు తగ్గట్టుకూడా వుంటాయి. ఆ పాటలు ప్రతిదేశపు వాఙ్మయములోను జోలపాటలు ఒక ప్రత్యేకస్థానాన్ని ఆక్రమించుకుంటాయి. ఈ పాటలు సామాన్యముగా అనుశ్రుతముగా వచ్చేవిగానేవుంటాయి. ఇటీవల వీటినన్నిటిని సేకరించాలని కొందరు వాఙ్మయప్రియులు ప్రయత్నిస్తున్నారు. ఈ జోలపాటలలో తిన్నటిరాగములేకపోయినా పిల్లలునిద్రపోతారు. ఈపాటలచరణాలలో ఎన్నో కలగూరగంపలాంటి విషయాలు వుంటాయి. వీటిలో సామాజికపరిస్థితులు, కట్టుబాట్లు, సామెతలు, సుద్దులు, వేదాంతబోధన పిల్లలను చల్లంగరక్షించమని దేవతలకు మొక్కులు తల్లి తనపుట్టింటిని గురించి కనే తియ్యటికలలు హృదయవేదన అన్నీవుంటాయి. పిల్లలకోసము వరములు, భర్తను తనకుటుంబాన్ని పాడిపంటను చల్లగాచూడమని దేవుళ్ళకు వేడికోళ్ళు యివ్వన్నికూడావుంటాయి. ఇంకా దేశకాలపరిస్థితులుకూడ తెలుస్తూవుంటుంది. జంగంకథలు, బుర్రకథలు వీటిలాగ జోలపాటలుకూడా పాతపాటలే. కాని ప్రతితల్లి కూడా వీటిని నేర్చికోవాలని కోరుతుంది. ప్రస్తుతకాలపు తల్లులు జోలపాడకపోతే బిడ్డలునిద్రపోరా? పూర్వపురోజుల్లో జోలపాటలని ఎవో పిచ్చిపిచ్చిపాటలు పాడుతుంటారు. అలాపాడటము అలవాటుచేస్తే, పిల్లలుజోలపాడితేకాని నిద్రపోరుఅంటారు. ప్రస్తుతపు తల్లులకు సామాన్యముగా జోలపాటలు బాగా వచ్చివుండవని నావుద్దేశ్యము. వచ్చినా పాడటానికి నామోషికూడాను. జోలపాడటము, ముసలమ్మలపంతని కూడా వారి అభిప్రాయము అయివుండవచ్చు. అదీగాక ఈ పాటలుపాడేవారు ఈచరణాలలో ఇంతగొప్ప భావాలు ఇమిడివున్నాయనే విషయము తెలిసికోనకుండగనే పాడుతూఉంటారు. అసలు యీజోలపాటల చరణాలు వింటూంటే ఎంతో చక్కగా పెద్దపెద్దవిషయాలు కూడా యిట్టే అర్థమైయే శైలిలో, పదాలతో, తెలియజెప్పినట్లు వుంటాయి. తల్లి తనబిడ్డను జోలకొట్టేప్పుడు మనసు ఎన్నోవిధాల పోతుంటుంది.

తనబిడ్డ అందరి దీవెనలవల్ల దేవతల రక్షణక్రింద పెరిగి పెద్దవాడై, శ్రీరాముడంత గొప్పవాడుగా, వీరుడుగా అవాలనివుంటుంది తల్లికి. తనకుటుంబములో జరగనటువంటి లేనటువంటి సంపద, సిరి యివన్నీ అలా వూహా ప్రపంచములో నిర్మించుకుంటుంది. మన సంఘములో సామాన్యముగా సమిష్టికుటుంబాలే ఎక్కువ. అంచేత యీ కుటుంబాల్లో అత్తల ఆడబిడ్డల ఆరళ్లు తలుచుకునే కోడలి దుఃఖము యిలాంటి చరణాలు వుంటాయి. సంఘములో పిల్లలేనివాళ్లను ఎంతచిన్నతనముగా చూచేది కొన్నిచరణాలలో వున్నాయి. చూడండి, 'ఒడ్డేల పాడవేల, వళ్లిసొమ్ములేల, చంకబిడ్డాలేని చక్కదనమేల' అన్నారు. ఒక స్త్రీ, మగ

పిల్లలను కంటే, వుండేగౌరవ మర్యాదలు, ఆడపిల్లలను కంటే లేవు. మగబిడ్డ పుట్టాడంటే వారిని లాము వుద్ధరించబడుతుందని. ఆడపిల్లపుట్టితే, యింటిలో విసుగుదల కనుపిస్తుంది. అంటే, సమాజములో స్త్రీల గౌరవాన్ని తెలియపరుస్తున్నారన్నమాట చూడండి.

శ్రీరామ చిక్కుళ్లు కనుమ కాకర్లు,
భోగవతి పుట్టాడు పొద్దు పొడపున్న
మొగబిడ్డ పుట్టాడు, మొలకపుట్టాడు,
ధనము పెట్టెలకల్ల దాతపుట్టాడు
ఆడదిపుట్టింది, అసురపుట్టింది

దండెముమీది కోకలకు దైతపుట్టింది
ఆడబిడ్డలకన్నమ్మ నీళ్లకుపోతే
అడికలు మెండాయె అభావికడను
మగబిడ్డలకన్నమ్మ నీళ్లకుపోతే
మోదుగలు తంగేళ్లు పూచినట్లుండు.

ఆడబిడ్డలకు పెళ్లిళ్లుచేసి, వారిని దూరదూరపు వూళ్లకు కాపరానికి పంపిన తల్లి, ఆ కూతురుని తలచుకుంటుంది. బాధపడుతుంది. 'ఆడపిల్లలను కనరాదు; ఆవిధిపడరాదు; దూరాన యివ్వరాదు. దుఃఖ పడరాదు' అనుకుంటుంది.

ఇదీగాక, పూర్వము చిన్నచిన్నపిల్లలకు పెళ్లిళ్లుచేసేవారు, ఆ చిన్నపిల్లలు, తమ తల్లిదండ్రులను తోబుట్టువులను పరిచయవాతావరణాన్ని వదలి కేవలము భర్త్రప్రేమకోసము అత్తవారింట క్రొత్తవాతావరణ లోకి వస్తారు. అప్పుడు వారు తమ పుట్టింటిని గురించి తియ్యటికలలు కనటము సహజము. యిలాంటివే కొన్నికొన్ని నుడుగులు.

పూర్వము యిప్పట్లోలాగ రవాణాసౌకర్యాలు వుండేవికావు. తలుచుకున్నప్పుడు పుట్టింటికివెళ్ళడానికి వీలువుండేది కాదు. అదీగాక ప్రయాణము చేయాలన్న కొన్నిరోజులుపట్టేది. ఒక్కొక్కప్పుడు అత్తింటికి పుట్టింటికి వైరాలువుండి, పుట్టింటికి వెళ్లటానికి వీలువుండదు. అన్నదమ్ములు ఏడాదికొకమారైనా పిలవరు. 'రామలక్ష్మణులంటి ఉన్నట్లుకలిగితే రాకపోకలు కలుగు ఎల్లకాలమ్మ' అని వాపోతుంది.

వెంకటప్పడికొండ వెలిసుండవలెను
ఎప్పటికి పుట్టిల్లు కలిగుండవలెను.

తనపిల్లలను, తల్లిదండ్రులకు అన్నదమ్ములకు చూపించాలనే కోరిక కనుబడుతుంది.
తన అన్నదమ్మునితో వియ్యమందాలనే వాంఛ యివన్నీవుంటాయి.

చిలుకలు చెలరేగి జీలకొమ్మ ఎక్కు
పార్యాలు చెలరేగి, పనసకొమ్మ ఎక్కు
అబ్బాయి చెలరేగి మామ భుజమెక్కు
మామ భుజమెక్కి మరియేమి అడుగు
పాలత్రాగు గిన్నెడుగు పాడావు నడుగు
కూర్చొను కుర్చీఅడుగు, కూతుర్ని అడుగు
తూర్పున ఒకమామ, చూడావునంప
పడమట నొకమామ పాడావునంప

ఆయావు ఈయావు దొడ్లోకితోలి
పితకరా అన్నయ్య బిందెల్లునోను
తాగరా అబ్బాయి నీబొజ్జనిండా.
అబ్బాయి మామల్లు ఎటువంటివారు
అంచుపంచెలవారు అంగీలవారు
అందరిమామల్లు చందమామల్లు
అబ్బాయి మామల్లు రామలక్ష్మణులు.

తమ పుట్టింటివారు బిడ్డకు తనకు చీరలు సొమ్ములు అన్నీయిచ్చి గారాబముచేయాలనే కోరిక

వుంటుంది. తన పుట్టింటి ఐశ్వర్యమునుగురించి చెప్పుకుంటుంది. తనబిడ్డకు తన పుట్టింటజరిగే గారాబాన్ని తెలియపరుస్తుంది. 'దొడ్లోను, అబ్బాయి దోగాడచూచి దోసపండని తాత ఎత్తిముద్దాడు.' 'పందిట్లో అబ్బాయి పారాడచూచి, పనసపండని మామ ఎత్తిముద్దాడు.' ఇవిగాక రామాయణకథ, కృష్ణుని చిలిపిచేష్టలు. పిల్లలకోసము ఎన్నివుపవాసాలు ఎన్నినోములు నోస్తారో తెలుస్తుంది.

"ఓయమ్మ, ఓతల్లి, ఓగోపిదేవి
ఎన్ని నోములునోచి కంటి కృష్ణుడిని.
చిన్ని పొద్దులుండీ శివరాత్రులుండీ
శివుడిస్తె కన్నాది చిన్నికృష్ణుడిని.
ఒక్కపొద్దులుండీ, వరచవుతులుండీ
వరమిస్తె కన్నాది వాసుదేవుడిని"

మన సంఘములో ఐదువతనానికి ఎంత ప్రాముఖ్యతవుందో చూడండి.

అలిమేలు మంగమ్మ ఆటకూటనా
అడిగితెచ్చుకొందు ఐదువతనమూ
గోవిందరాజుల కొలువుకూటానా
కోరితెచ్చుకుందు కొంగుబంగారూ.

ఇంకా వేదాంతబోధన ఎంతసులభశైలిలో చెప్పారో వినండి.

తొలుత బ్రహ్మాండంబు తొట్లగావించీ
నాలుగు వేదములు గొలుసులమరించీ
తొమ్మిదివాకిండ్ల దిడ్డిలోవలను
పట్టవలె ఆర్గురిని పదిలంబుగాను
కట్టవలె ముగ్గురిని కదలకుండాను
వుంచవలె నొక్కర్ని ఉచితంబుగాను" అన్నారు.

అసలు మనదేశములో సంఘములో పిల్లలు కుటుంబవృద్ధి వీటికి తర్వాతనే ఆస్తిపాస్తులు. సామాన్యముగా ఒకరి చూడగానే మొదట మనము మీకెంతమంది పిల్లలండీ అని అడుగుతాము కాని ఆస్తిపాస్తులను గురించి అడగము. ఆ కాలములో దేశమంతా సస్యశ్యామలముగా శాంతియుతముగా జనులు సుఖముగా వుంటూవుండేవారు. ఇవిగాక తీర్థయాత్రలను గురించి కాశీనుంచి రామేశ్వరముదాకా, ఆగుళ్లను, గోపురాల వర్ణనలు వున్నాయి. ఆకాలపు సామాజిక కట్టుబాట్లు బంధుమిత్రులమీద ప్రేమాతిశయాలు కనుబడుతాయి. సంఘములో నడుచుకొనవలసిన నీతినియమాలు అన్నీ చక్కటి శైలిలో గోచరమౌతాయి. ఈజోలపాటలు పాతపాటలే అయినా, మన సంఘజీవితము సంఘముద్వారా సమిష్టికుటుంబాలు వీటినే అద్దములాగ ప్రతిబింబింపజేస్తాయి. ఈపాటలు నిజంగా సేకరించి ప్రచురించవలసిన అవుసరము ఎంతైనావుంది. ఇంతవరకు ఈపాటలు అనుశ్రుతముగా వస్తున్నయి కాని, ముందుముందు యివి అంతరించకుండా జాగ్రత్త పడాలి. అందులోను ముఖ్యముగా స్త్రీలు యిలాంటి పాటలను సేకరించటానికి పూనుకోవాలి,

(A. I. R. వారి అనుమతితో)

# అభివందనములు

[17-7-49 న త్యాగరాయనగరమునందు కేసరి తెలుగు ఎలిమెంటరీస్కూలు స్థాపింపబడిన సందర్భమున శ్రీ శాస్త్రిగారు శ్రీ కేసరిగారినిగూర్చి చదివిన అభివందనపద్యములు

శ్రీకరమగు కార్యములను
తేకువ మది నెంచి రయము తిరముగఁ జేయన్
తా కర ముత్సాహించెడి
నీ 'కేసరి నిన్' చిరంబునీశుడుఁ బ్రోచున్.

శ్రీలకు నాలవాలమయి చెన్నలరారెడు భారతీయవి
ద్యాలయ జ్ఞానదీప్తుల ప్రభన్ నివసించిన 'కేసరీ' దయా
పాలుని శేముషీ ప్రతిభపారయశస్సిదె! విద్యశాలయా
పాలను దాల్చి నిల్చినవి భారతి సేవయె నిత్యస్తోత్రమై.

వసియించె గతియించి పలుమారు స్పృహకొచ్చు భారతామ్నాయంబుపఠనజేయ!
కనుపించు దనిపించు కరగించు హృదయంబు స్వారోచిష ప్రతిభలనుగాంచ!
నిరసించు వికసించు నమసించి పగిలించె కఁచుధక్కుల ప్రభాగాధవినగ!
తెగియించి నెదురించి బిగియించి సమసించు రణతిక్క భుజభలార్భటుల గాంచ!

నెన్నడో జరిగెననుచు విన్న నేడు కనులగాంచితిమిటు మహా గౌరవముగ!
నీ నిరుద్ధాత్మ తెనుగుల నీతిపథము ద్రొక్కి వర్తింప నీ కీర్తిరూపు స్థిరము!

ఎంతదలంచితో! హృదయమెంత విశాలమొ! సంఘసేవ నీ
కెంతముదంబు గూర్చెనో? మరెంత స్వభాషల ప్రేమప్రజ్ఞ ని
న్నెంతగఁ జేసెనో? ప్రతిఫలించెను నీప్రతిభాప్రకాశమున్
ఇంతగ ధన్యమాయె భవదీయ మహోజ్జ్వలజన్మ "కేసరీ"!

తెనుగుపురంబు చెన్నపురి! ధీవరులాంధ్ర కుమారులై జోదులై
దనరెడి బాల బాలికలు! దామర దంపరలై సతంబు వి
ద్యను గడియించి ఆంధ్రకుల దార్ఢ్యత పట్టుదలల్, వివేక వృ
ద్ధినలుగ నీపురంబున సతంబు వెలుంగుడు, కీర్తిమూర్తులై!

జి. వి. యన్. శాస్త్రి.




(గతసంచిక తరువాయి)

వచనం॥

ఆ రుక్మిణీ దేవి యొక్క యందము బుద్ధి,మంచి స్వభావము,మంచి చిహ్నములు మంచి గుణములు ద్వారకా నగర మందలి శ్రీ కృష్ణమూర్తి వారికి దెలిసినవి. ఆయన రుక్మిణీ దేవిని బెండ్లాడ వలెనని తలంచెను. రుక్మిణి యున్న తనయింటికి నతిథులుగా వచ్చెడి వారి వలన శ్రీ కృష్ణునియొక్క చక్కదనము, బలము, మంచి గుణములు విని యాతడే తనకు దగిన భర్తయని తలంచి యుప్పొంగు చుండెడిది.

పెండ్లికూతునకు బెండ్లికుమారునకు ॥తం॥
ఉద్దేశములు ఉండిన ఫలమేమి?
తల్లి దండ్రులయానతి కావలెను
తప్పక భంధుల యాజ్ఞలు కావలెను
అందరి కోరిక లొకే రీతి జెలగ

మిశ్రం॥

బంధుగులందరుకృష్ణమూర్తికే బాలికరుక్మిణి
నిచ్చి వివాహము సలిపిన బాగని
భల్లాకవు పట్టుపట్టినారు
తల్లి తండ్రులు తలచిరి మేలనుచు ॥తం॥

వచనం॥ అయిన లాభమేమి?

పానక మందలి పుల్ల తీరుగాను
వరము దుర్మాతుడు, భీష్మక పుత్రుండు,
బాల రుక్మిణికి బెద్ద యన్న రుక్మి
మేలు దలంచక యడ్డు నిలిచి యుండె
చెల్లెలి కృష్ణుని పెండ్లి జేయ జాల
గొల్ల వానికి చెల్లెలి నిచ్చెదనా?
నల్లని కొండ ముచ్చున కిచ్చెదనా?
గోవుల గాచే వాని కీయ జాల
గోపిక వలువల దొంగ కీయ జాల
వెన్నను మెసవెడి పెడగు కీయజాల

మన్ను మ్రింగిన వెఱ్ఱికీయ జాల
అనుచు రుక్మి దా నడ్డు దలచి యుండె
రుక్మిగారి కొక స్నేహితు డున్నాడు
రుక్మిని మించిన దుర్మార్గుం డతడు
చక్కగ వీరికి జట్టు కలిసి యుండె
ఓగును మెచ్చుట ఓగున కే చెల్లు
బురదను పొరిలెడి పందికి పన్నీరా ?
చేది దేశపు రాజైనటు వంటి
శిశుపాలునితో రుక్మికి స్నేహంబు
శిశుపాలునకు శ్రీ కృష్ణున కున్న
ఆ గర్భ విరోధం బంకురించి యుండె.

మిశ్రం॥

ఆ కారణమున శిశుపాలున కే
రుక్మిణి నిచ్చి వివాహము జేయగ
రుక్మిగారు కడు పట్టు బట్టినారు॥
బంధువు లందరు భావ్యము గాదనిరి
తల్లి దండ్రులు తగదని పలికిరి
ఎంద రెంతగా జెప్పిన వినడాయె
ఏమి దోచదా తల్లి దండ్రులకును
మీసాల్గడ్డా ల్మొలచిన తనయుని
మీరజాలరా ముసలి తల్లి దండ్రుల్
భీష్మక రాజు తలపు చెల్లకుండె
భీష్మించిన యా రుక్మి గర్వమునను
మంచి ముహూర్తమ్మును బెట్టించి
అంచితముగ శుభ లేఖలు వ్రాయించి
వినోదముగ గడు విచిత్రంబుగాను .
వివాహ సన్నాహమ్ములు గావించె.

వచనం॥

ఎవరినిన్నీ లెక్కసేయక తనను శిశు



పాలున కిచ్చి వివాహము జేయుచున్నాడను సంగతి రుక్మిణీదేవికి తెలిసినది. ఏమిచేయ గలదు ? తనకు మంచి యాప్తుడైన అగ్ని ద్యోతనుడను బ్రాహ్మణుని బిలిపించి

మహా సమయ మిది బ్రాహ్మణోత్తముడా !
మహా యాపదను మునిగి యున్న దాన
రక్షించుము రక్షించుము మాయప్పా !
పక్షి రీతి యాధారము లేదప్పా !
కాలా తీతము సేయవలదు తండ్రీ !
కార్యము మిగిలిన ఫలము లేదు తండ్రీ !
కాపాడుము నా కాపు లెవరు లేరు
కాపాడుము నీ కెంతో పుణ్యంబు.

వచనం॥

మా పెద్దన్న గారగు రుక్మిగారు తన స్నేహితుడైన దుర్మార్గుండగు శిశుపాలునకు నన్ను వివాహము గావింప సిద్ధముగా నున్నాడు కనుక

మాయన్న యభిప్రాయము మాన్పుటకు
మా జనకున కెట్లునుసాధ్యము గాదాయె
త్వరగా మీరలు ద్వారక కేగవలె

హరితో మీరీ విషయము దెలుపవలె
భక్తుల గాచే భగవంతుం డతడు
భక్తురాల నను గాపాడగ జెపుడు
భార్యగ గైకొని శిశుపాలుని జిక్కకను
పాలించుటయే పరమ ధర్మమనుడు
చక్రధారి తన చక్ర మహత్త్వంబు
చక్కగ శిశుపాలునకు జూప మనుడు.

అని రహస్యములు విప్రునితో దెలిపి
అతని పాదంబులపై వ్రాలంగ
శీఘ్రముగా నే నేగుచుంటి నమ్మా!
శ్రీకృష్ణునకు సందేశము దెలిపి
తోడ్కొని వత్తును తోయజాక్షి నమ్ము
భక్తురాల! నీ కార్యము ఫలియించు
భయము వీడుమా కోరిక ఫలియించు.

(పశేషము)

# రీటా తల వెండ్రుకలను పెంచును



రీటా కుదుళ్ళకు బలమునిచ్చి నిగనిగలాడు నిడుపాటి వెండ్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్. తలవెండ్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేనుకొరుకు ఇంకను తలవెండ్రుకలకు సంబంధించిన సమస్తవ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేనవేలు వాడి గుణమును పొందియున్నారు. మీరుకూడా నేటినుండియే రీటా వాడుడు.

## హిందీ, ఆంధ్ర, తమిళ, కన్నడ తారల ప్రశంసలు

**లలితాపావర్:** ఉత్తమమైన హెయిర్ టానిక్ కోరేవారికి రీటాకు మించినది మరేదీలేదు. దానిని వాడితే వారు మనమాతృభూమి అనేక శ్రేష్ఠమైన వస్తువులను ఉత్పత్తి చేయగలదని గ్రహించుకోగలుగుతారు.

**సుశీల్ కుమార్:** రీటా శిరోజాల వృద్ధికి మిక్కిలి సంతృప్తికరమైన సాధనం. శిరోజాలు రాలిపోతున్నపుడు నివారణకు, బుద్ధినైర్మల్యానికి ఎల్లరూ ఎప్పుడూ రీటానే వాడాలని సిఫారసు చేస్తున్నాను.

**కన్నాంబ:** రీటా నాకు పరిపూర్ణమైన తృప్తికలిగించినదని తెలుపుటకు మిక్కిలి సంతోషముగానున్నది. అది నిజముగా అమోఘమైనది.

**పుష్పవల్లి:** నాకు సుమారు ఏడాదిగా తల వెంట్రుకలు రాలిపోతున్నవి. రీటా వాడినప్పటినుండియు, తలవెంట్రుకలు రాలుట తగ్గింది. ఇది చాల శ్రేష్టమైన హెయిర్ టానిక్ అని నా అభిప్రాయము.

**సూర్యకుమారి:** రీటా మంచి సువాసనకలిగి, వాడినవారికి ఎంతో చల్లదనము చేకూర్చును. ఇకమీదట ఎల్లప్పుడు రీటానే వాడవలయునని నేను ఒక నిశ్చయమునకు వచ్చితిని.

**కృష్ణవేణి:** రీటా చక్కని సువాసనగలిగి, మనస్సునకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. తల వెంట్రుకలను రాలకుండాచేసి, క్రొత్త వెంట్రుకలను పెంచుటకు రీటా సాటిలేని హెయిర్ టానిక్.

**ఆర్. పద్మ:** నా ముఖసౌందర్యమును పెంపొందించే శిరోజాలకు రీటాయే కారణము. స్వల్పకాలములోనే రీటా అద్భుతముగ గుణము నిచ్చినది.

**లక్ష్మీబాయి:** తలవెండ్రుకలను పెంచుటకు రీటా అమోఘముగ పనిచేసినది.

**వసుంధరాదేవి:** శిరోజాలు దీర్ఘంగా నిగనిగలాడుతూ ఎదగడానికి, శిరోజ రక్షణకు రీటా అమోఘమైనదిగ రుజువైనది.

**రాజమ్మ:** శిరోజ సంబంధమైన బాధల నివారణకు రీటా అమోఘమైనది. గుర్తించుకున్నాను. శిరోజవృద్ధికి, రక్షణకు ముఖ్యమైన వస్తువులు రీటాలోవున్నవి. దీర్ఘవినీలకుంతలాలు ఆశించే మహిళలందరూ దీనినే వాడాలి.

# రీటా హెయిర్ టానిక్



# శారద లేఖలు

సౌ॥ భాగ్యవతి కల్పలతకు

నెచ్చెలీ !

దేశభక్తుని మృతవార్త ఆంధ్రులనింతగా దుఃఖ నిమగ్నుల గావించుటలో వింతలేదు. దేశసేవ నిమిత్తము వేలుగడించు న్యాయవాదవృత్తిని యేనాడో వదులుకొని చరమనిముసమువఱకు ప్రజా సేవయేచేయుచు జీవితము చాలించిన ధన్యజీవి కొండ వెంకటప్పయ్య పంతులుగారు.

అసత్యమును, అవినీతిని, అకృత్యమును, ఏరూపమునను, ఏసమయమునను, ఏమాత్రమును సహింపని నిష్ఠురధార్మికుడామహనీయుడు. ఏది సత్యమో దానిని వెల్లడించుటయందు, ఏది ధర్మమో దానిననుసరించుటయందు, ఏది యుక్తమో దాని నాచరించుటయందు వెనుదీయని వీరవరుడామహాపురుషుడు.

ఆయన దేశభక్తి అగ్గలమైనది. మాతృదేశము పారతంత్ర్యమునుండి విముక్తి నందుటకు దేశమున నెన్ని మహోద్యమములు బయలుదేరెనో అన్నిటను ఆయన పాల్గొనెను.

ప్రప్రథమమున నారంభమైన వందేమాతరోద్యమము, ఆవెనుకవచ్చిన హోంరూలు ఉద్యమము, ఆతరువాత బయలుదేరిన సహాయనిరాకరణోద్యమము అన్నిటియందును పాల్గొని మాతృదాస్యవిముక్తికై అనేకమారులు జైలుయాత్రలుచేసెను. గుంటూరుజిల్లా బాపట్లతాలూకా నందిపాడు ఫిర్కాయందు పన్నుల నిరాకరణోద్యమమును సాగించి బ్రిటిషు పరిపాలనయను ఉక్కుకట్టడమును ఉర్రూతలూగించెను. ఆనాడు వేంకటప్పయ్య పంతులనినను, గుంటూరు మండలమనినను, తెల్లదొరల గుండెలు ఝల్లుమనెడివి. బ్రిటిషువారికి ఆంధ్రదేశమనిన సింహస్వప్నము గావించినది యీ అరిభీకరుని అద్భుతశౌర్య సాహసకృత్యములే.

వేంకటప్పయ్య పంతులుగారిసేవ బహుముఖములు. ఆదియందు కృష్ణాపత్రికా సంపాదకుడుగా ప్రజాహిత జీవనమారంభించి తన ఉజ్వలమైన రచనలచే ప్రజల ప్రబోధించెను. డచ్ రిపబ్లిక్‌స్థాపన, ఇటలీ స్వాతంత్ర్యచరిత్ర, స్వీయచరిత్ర, వేంకటేశ్వర శివానందలహరి మున్నగు గ్రంథములు వ్రాసెను. కవితలల్లెను. ఈ సారస్వతప్రియుడు కళోపాసియునై నాట్యరంగమున ప్రకాశించెను. చట్టసభలలో జేరి ప్రజాహిత కరములైన శాసనములు గావించుటకు అవిరళకృషిసల్పెను. మద్రాసు రాష్ట్రమున గ్రంథాలయములకు ప్రభుత్వమువారు విరివిగా గ్రాంటులనిచ్చునట్లు శాసనసభలో తీర్మానము చేయించి గ్రంథాలయములకు అమూల్యసహాయ మొనర్చెను. రాయలసీమను క్షామముచుట్టుముట్టి ప్రజలెల్లరు ఆకలిమంటలచే ఘోషిల్లునపుడు వార్ధక్యముచేతను, అనారోగ్యముచేతను పీడింపబడుచుండియు వానిని లక్ష్యపెట్టక ప్రాంతప్రాంతమునను పర్యటించి లక్షలాది క్షామనిధిని వసూలుచేసి క్షామపీడితులకు పంచిపెట్టుచు నెలలకొలది రాయలసీమలో నివసించి క్షామప్రాంతముల కెనలేని సహాయమొనర్చెను.

వర్తకులలో చెలరేగియున్న దొంగనిల్వలు, చీకటిబేరములు, ఉద్యోగులలో ప్రబలియున్న లంచగొండితనము, ప్రజలలో వ్యాపించియున్న కులమతవర్గవిభేదములు రూపుమాపుటకెంతయో కృషిసల్పెను.

ఆంధ్రదేశమేగాదు, చెన్నరాష్ట్రమేగాదు భారతవర్షమున బయలుదేరిన ప్రజాహితోద్యమములలో ఆయనచేరని యుద్యమమేలేదు. ఇంతగా సకల ప్రజాహిత కార్యములందును పాల్గొని యుండుట

చేతనే ఉత్తరభారతవర్షమునను, గౌరవనీయమైన స్థానము నందుకొనగలిగెను. మహాత్ముడాయనను జ్యేష్ఠ భ్రాతగను, రాజేంద్రప్రసాదాదులాయనను ప్రియ సహోదరునిగను, జవహరుపండితుడు నాయనను పితృతుల్యునిగను భావించెడి వారనిన ఆయనయెట్టి పూజనీయ స్థానమును బడసెనో చెప్పవలయునా? సమస్త ప్రజాహిత కార్యములలో ఆయనదే ముందంజ. ఇట్లయ్యును, ఆయన అధికార కాంక్షి కాడు, పదవీ వ్యామోహితుడు గాడు. ఇదియే ఆయనలోగల విశిష్టత.

ఆయనపాల్గొనిన సమస్త ఉద్యమములలో ఆంధ్ర రాష్ట్రోద్యమము ఆయన ప్రాణములో ప్రాణము. ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణము ఆయన ముఖ్యమైనకోరిక. ఆదిస్వరాజ్యంవచ్చిన తత్క్షణమే నిర్మింపబడగలదని ఆయన విశ్వసించెను. కాని శాలేదుసరి గదా. ఆంధ్రరాష్ట్ర నిర్మాణము రచ్చకెక్కి థార్ కమిటీ నియామకముగా, అగ్రనాయకత్రయనివేదికగా తయారగుటయు, చెన్నపురిలేని ఆంధ్రరాష్ట్రమునకు రాయలసీమవారు విముఖులగుటయు, చెన్నపురినిచ్చుటకు వీలులేదని తమిళులు శఠించుటయు, చెన్నపురిపై శాశ్వతముగా పూర్తిగా సర్వహక్కులు వదులుకొనినగాని ఆంధ్రరాష్ట్రమేర్పడుట కవకాశములేదని ఆంధ్రుడయ్యు రాష్ట్రపతి పట్టాభి అగ్రనాయకత్రయ నివేదికను వ్యాఖ్యానించుటయు, సర్వత్ర వివాదములేకుండిననే భాషారాష్ట్రము లేర్పరచుటను గురించి యోచించుట కవకాశముగలదనియు, లేకున్న ప్రస్తుత క్లిష్టపరిస్థితులలో భాషారాష్ట్రముల నేర్పరచు యత్నమును చేయజాలమనియు నెహ్రూపండితుడు మాటిమాటికి వక్కాణించుచుండుటయు, ఈ విపరీత పరిస్థితులలో తన ప్రియతమమైన ఆంధ్రరాష్ట్ర నిర్మాణమూ అంతకంతకు దవుదవ్వగుటయు గాంచిన ఈ వేదనయే, ఈ నిరాశయే, ఈ నిస్పృహయే దేశభక్తుని అంతిమయాత్రను దగ్గిరకుతెచ్చినదని చెప్పవచ్చును. 1913 సంవత్సరములో బాపట్లయందు ప్రథమాంధ్రమహాసభ జరిగినది మొదలు అనగా ముప్పదియారు వత్సరముల నుండి ప్రత్యేకరాష్ట్రముకొఱకై అవిరళముగు కృషి సల్పియు, స్వతంత్రభారత వర్షములోగూడ తన యాప్సితము నెరవేరు నవకాశము కనుపించనప్పుడు

దేశభక్తుడు చింతాక్రాంతుడగుటలో ఆశ్చర్యమేమున్నది? దేశభక్త వేంకటప్పయ్య పంతులుగారు ఎనుబదినాలుగేండ్ల వృద్ధుడేయగుగాక. ఆయన చిరకాల వాంఛితమైన రాష్ట్రనిర్మాణమును కనులజూడకనే దివంగతుడగుట ఆంధ్రులెల్లరు దుఃఖించవలసిన విషయము. బహువిధ కార్య నిమగ్నులయ్యు వేంకటప్పయ్య పంతులుగారు స్త్రీలయభ్యుదయముకొఱకై కృషి చేయకమానలేదు. స్త్రీ జనాభ్యుదయమే, దేశాభ్యుదయమని ఆయన విశ్వాసము.

ఈనాడు ఉన్నవదంపతుల మహోజ్వల కృషిచే ఆదర్శ స్త్రీ విద్యాసంస్థయై యెల్లరి నాకర్షించుచున్న శారదానికేతనము స్థాపింపబడుటకు కొన్ని వత్సరములకు పూర్వమే శారదానికేతనము పేరుతో స్త్రీలకొక విద్యాలయమును నెలకొల్పవలయుననియు, దానిని సాగరతీరమైన బాపట్లతాలూకాయందలి వేటపాలెములో నేర్పరచవలయుననియు నుద్దేశించి వేటపాలెములో క్రైస్తవ మిషనరీల తాలూకు కొన్ని బంగళాలు విక్రయమునకురాగా వేంకటప్పయ్య పంతులుగారుకొనిరి. ఆ స్త్రీ విద్యా గురుకులమును నడుపుటకు సమర్థులును, సేవాపరాయణులును, గోపాలకృష్ణ గోఖలేగారు స్థాపించిన భారతసేవక సమాజము (సర్వెంట్సాఫ్ యిండియా) నకు చెందినవారునునైన వేంకట సుబ్బయ్యగారిని పత్నీయుక్తముగ నాహ్వానించిరి. వారును గుంటూరువిచ్చేసి ఆ మరునాడు వేటపాలెము వెళ్ల నుద్దేశించి యుండగా నాటిరాత్రియే గోపాలకృష్ణ గోఖలేగారు పరమపదించుటయు, ఆ దుర్వార్త వినినవెంటనే వేంకట సుబ్బయ్యగారు పూనా వెళ్లుటయు, నచ్చటివారు వేంకట సుబ్బయ్యగారిని మరల రానీయక పోవుటయు, నట్టియుత్తమవ్యక్తి మరియొకరు లభింపకపోవుటయు, కారణముగా వేంకటప్పయ్య పంతులుగారి శారదానికేతనస్థాపన యత్నమంతట నాగిపోవలసినదాయెను. ఆ పిమ్మట యావద్భారత వర్షమును ముమ్మరముగా చెలరేగిన భారతస్వారాజ్య శాంతి సంగ్రామములో పంతులుగారును నిమగ్నులైన కారణముగా శారదానికేతనము వారు స్థాపించలేకపోయిరి. అయినను ప్రస్తుతము గుంటూరునందు ఉన్నవదంపతులచే ప్రతిష్ఠితమైన శారదానికేతన పరిపాలకులలో తామునొకరై ఆదినుండియు దానికి ఎంతయో సహాయమొనర్చుచుండిరి. అంతియేగాక తమ 200 యకరములుగల అగ్రహారమును శారదానికేతనమునకు దానమొనర్చి యిటీవలనే రిజిస్టరుచేసి ఆ స్త్రీ విద్యాసంస్థయందు తమకుగల అభిమానమును క్రియాపూర్వకముగా నిరూపించిరి. తమ కొమార్తెయైన పార్వతీదేవికి ఉన్నతవిద్య చెప్పించియు, మహిళోద్యమములలో నామెపని చేయుటకు పెక్కువిధముల ప్రోత్సహించియు, భారతమహిళాసంఘ ప్రతినిధి వర్గనాయకురాలుగా ఆమె స్విట్జర్లాండు వెళ్లునప్పుడామెకు విదేశయాత్రకు వలయు ధనము నంతయునిచ్చియు స్త్రీజనోద్యమమునెడ తమకుగల ఆదరాభిమానముల చూపించిరి. ఇంతియేల? పంతులుగారి స్త్రీ విద్యాభిమానమునకును, స్త్రీజనాభ్యుదయాభిలాషకును పార్వతీదేవియే మచ్చుతునకయని చెప్పవచ్చును. తండ్రిగారి ఆశయములు, ఆదర్శములు ఆమెలో అంతగా రూపొందినవి.

వితంతు పునర్వివాహోద్యమమునందును పంతులుగారికెంతయో అభిమానముగలదు. 43 సంవత్సరములకు పూర్వము వేంకటప్పయ్య పంతులుగారు, బందరునందు న్యాయవాదిగానుండగా వల్లూరి సూర్యనారాయణరావుగారు, చెన్నాప్రగడ భానుమూర్తిగారు, దుగ్గిరాల రామమూర్తిగారు మున్నగు మిత్రులతో కలిసి ఒక వితంతు వివాహము గావించిరి. ఆ వివాహమునకు వారు నల్వురు తమ తమ భార్యలనుగూడ తోడ్కొనిపోయిరి. అనాడా వివాహము బందరునందలి సనాతన సంఘములో విపరీతమైన యలజడికి కారణమై బహువిధమైన సంఘబహిష్కార కష్టములకు పంతులుగారును వారి మిత్రులును లోనుకావలసివచ్చెను.

తమ కొమార్తె పార్వతీదేవిగారికిగూడ పునర్వివాహము చేయవలెనని వేంకటప్పయ్య పంతులుగారు ఉద్దేశించిరికాని దేశసేవాసక్తయైన పార్వతీదేవి పునర్వివాహమున కంగీకరింపనందున ఆ ప్రయత్నము విరమించుకొనిరి.

అతిబాల్య వివాహములు దేశారిష్టకరములనియు బాలికల వివాహవయస్సు హెచ్చింపబడినగాని బాలికలు విద్యాభ్యాసముచేయుట కవకాశముండ

దనియు నుద్దేశించి శారదాయాక్టు ఆచరణలోకి వచ్చుటకు ప్రోత్సహించిరి.

వేశ్యాసంఘములో మేళములుకట్టు పద్ధతి పోవుటకును, కులవృత్తినిమాని వివాహములు చేసికొనుటకును ప్రోత్సహించి వారి అభివృద్ధికి తోడ్పడిరి. ఈ విధముగా పంతులుగారు 1866 సంవత్సరములో జన్మించి 83 సంవత్సరములు జీవించి దాదాపు అర్థశతాబ్దము దేశమును అవిరామముగా సేవించి దేశభక్తుడను బిరుదునందెను. సత్యాహింసల తు.చ తప్పకుండ అనుష్ఠించి మహాత్మునకు ఉత్తమానుచరుడనిపించుకొనెను. అన్యాయమును, అవినీతిని నిర్మూలించుటకై రొమ్ముతెగకపోరాడి అపరభీష్ముడనిపించుకొనెను. సత్యవచస్కుడనియు, ఋజువర్తనుడనియు, స్ఫటిక నిర్మల హృదయుడనియు, ఈశ్వర విశ్వాసియనియు పేరుగాంచెను. మానవజన్మ సార్థక్యమునకేమేమి వలయునన్నియు గావించి 1949 ఆగస్టు 15 తేదీ సోమవారమున భారతస్వాతంత్ర్య ద్వితీయ వార్షికోత్సవదినమున భారతప్రజానీకము హర్షోత్సుకతతో ప్రాభాతనీరేజబంధు ప్రభలతో త్రివర్ణపతాకల నెగురవేయుచు జయజయ నినాదములు సలుపుచుండ శ్రవణపేయముగ నాలించుచు తనువుచాలించెను. దేశభక్తాగ్రేసరుడైన మహావ్యక్తి స్వర్గస్థుడగుటకు యింతకంటె యుత్తమమైన దినముగలదా? సూర్యుడు ఉత్తరాయణగతుడగువఱకు జీవముబు చిక్కపట్టిన భీష్మాచార్యులవలె ఈ అపరభీష్ముడును స్వాతంత్ర్య వార్షికోత్సవ వాసరమువఱకు ప్రాణములు చిక్కబట్టుకొని యా శుభదినమున ప్రాణములు విడిచెను. స్వచ్ఛందమరణమన నిట్టిదేగాదా! దేశభక్తుడు ధన్యుడు; ధన్యతముడు. సందేహము లేదు. కాని ఆయనలో ఆరని ఆవేదనను కలిగించుచు మిగిలిపోయిన తీరనికోరిక ఒకటేగలదు. అదే ప్రత్యేకాంధ్ర రాష్ట్రము. 1949 ఆగస్టు 24 తేదీని ఆయన దశాహ సందర్భమున అశేషాంధ్ర ప్రజానీకమాయనకు శ్రద్ధాంజలి సమర్పించినది. దేవాలయములలో, మసీదులలో, చర్చిలలో ఆయన ఆత్మశాంతికై ప్రార్థనలు జరిగినవి. కాని దేనికొఱకై దేశభక్తుడు 36 సంవత్సరము లహోరాత్రములు తీవ్రతపస్సు చేసెనో, ఆ ఆంధ్రరాష్ట్రము చేకూరనిదే ఆయన ఆత్మకు శాంతికల్గునా? ఇది ప్రతి ఒక్క తెలుగు ప్రాణియు ప్రశ్నించుకోవలసిన విషయమును ప్రతీకారము చింతింపవలసిన విషయమును కాదా కల్పలతా?

మిత్రురాలు

శారద

# బాలప్రహ్లాద

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

ఆగస్టు సంచిక తరువాయి.

### ౭ వ రంగము

హిరణ్యకశిపుని శయనాగారము.

హి॥ (ఆవేదనతో అటూ యిటూ పచారుచేస్తూ) నిజము, నిజము, సాత్త్విక తేజము అజేయము. సాత్త్వికతేజమును తామసతేజము నిర్జించలేదు. ఆత్మబలమును పశుబలము అరికట్టలేదు. లేకున్న ప్రహ్లాదునియెడ నేనుగావింపజేసిన హింసాచర్యలకు వాడింకను జీవించియుండుట సంభవమా; ఒక్కపనీ వానినిజయింపలేని నాశక్తి! నాప్రాభవము బలీయమని నమ్ముటెట్లు?

ముంచితి వారులకౌ గదల<br>
మొత్తితి శైలతటంబులందు ద్రో<br>
బ్బించితి శస్త్రరాజి బొడి<br>
పించితి మీదనిభేంద్రపంక్తి ఆౘ<br>
ప్పించితి ధిక్కరించితిశ<br>
పించితి ఘోరదవాగ్నులందు ద్రో<br>
యించితి బెక్కుపాట్ల నల<br>
యించితి జావడి దేమిచిత్రమో?

ఎఱుగడు జీవనౌషధము<br>
లెవ్వరుభర్తలు లేరు బాధలం<br>
దఱలడు నైజతేజమున<br>
తథ్యము జాడ్యము లేదు మిక్కిలిన్<br>
మెఱయుచునున్నవాడొకని<br>
మేషము దైన్యమునొందడింక నే<br>
తెఱగున ద్రుంతు వేసరితి<br>
దివ్యము వీనిప్రభావమెట్టిదో!

(అనిచింతాక్రాంతుడై మొగమున చేయిపెట్టుకొని కూర్చుంటాడు.)

లీలావతి; (ప్రవేశించి) నాథా. అర్ధరాత్రమైనను నిద్రింపక యిట్లుకూర్చున్నారేమి?

హి: దేవీ! నిద్రవచ్చుటలేదు. నీవూ నిద్రింపక నింత ఆలస్యం చేశావేమి?

లీ: ప్రహ్లాదుడీనాడు అమ్మా! నీవే నాకన్నం పెట్టవలెను. నీవే నిద్రబుచ్చవలె-అని మారాం పెట్టినాడు. వానికన్నం పెట్టి నిద్రబుచ్చి వచ్చేటప్పటికి ఆలస్యమైంది,

హి: భయపడినాడేమో తండ్రి! (అని కన్నీళ్లు తుడుచుకుంటాడు.)

లీ: భయమెందుకు?

హి: దేవీ!

లీ: నాథా!

హి: ప్రహ్లాదుని శరీరమందెక్కడనైనా గాయాలుగాని కదుములుగాని ఉన్నవేమో చూచావా?

లీ: ఏమీలేవే! ఎప్పటివలెవెన్నవలె మృదువుగా మిసమిసలాడుతూ సువర్ణచ్ఛాయలతో ప్రకాశిస్తున్నదే! దెబ్బలెక్కడ తగిలినవీ!

హి: (నిట్టూర్చి) ప్రహ్లాదుడు హరిభక్తి వీడనందులకు కోపించి క్రూరాతిక్రూరుండనై కొరడాలచే

గొట్టించీ, గండశిలలపై దొర్లించీ, విషోరగంబుల గఱపించీ నానా బాధల పాలు చేయించితినిలే! ప్రహ్లాదుడు నీతో చెప్పలేదా?

లీ: ఏమీచెప్పలేదు. మామూలుగా ఆడుకుంటూ పాడుకుంటూ వచ్చాడు. అన్నం పెట్టమన్నాడు. పెట్టాను. నిద్రబుచ్చమన్నాడు. జోకొట్టి నిద్ర బుచ్చాను. హాయిగా నిద్రబోయినాడు. చాలా ప్రొద్దుబోయింది. మీరుగూడా నిద్రబోరాదా?

హి: లీలా ఎట్లానిద్రబోను. ప్రహ్లాదుని విష్ణుభక్తి నాకు విషమసమస్యై పోయింది. హృదయ శల్యమై పోయింది. ఆదేవేంద్రుడు నిన్ను చెఱగొని పోయినప్పుడు ఆపాడునారదుడు అడ్డుపడి నిన్ను చెఱవిడిపించి తన ఆశ్రమానికి తోడ్కొని పోకపోయినట్లైతే నీవు ప్రసవించగనే ఆదేవేంద్రుడే వీడిని తెగటార్చి యుండును. నాకీబాధ . లేకపోయి ఉండును. అలా జరగక పోవడంవల్ల ప్రహ్లాదుని వధించుటకు నేనేచంద్రహాసం పట్టవలసి వచ్చింది. తెల్లవారితే కన్నకొడుకును చేతులారా చంపవలసి ఉండగా లీలా! నాకీరాత్రి ఎట్లు నిద్రరాగలదు?

లీ: అయ్యో! అయ్యో! ఏమన్నారు! తెల్లవారితే నాకన్నతండ్రిని నాప్రహ్లాద కుమారుని చంపి వేస్తారా? నాథా యిది నిజమే! మీస్వహస్తములతో కొమారుని చంపడం నిజమే,

హి: ఏమిచేయనులీలా? నేటి సాయంత్రము చండామర్కుల వారువచ్చి ప్రహ్లాదుడు తానువిష్ణుభక్తుడై నిరంతరం భగవత్సంకీర్తన చేయడమేగాకుండా తోడిబాలకులను గూడ కూడదీసుకొని వారికి గూడా విష్ణుభక్తి బోధిస్తున్నాడనీ, నేడుతాను అనుష్ఠానంబులు తీర్చుకొని వచ్చుసరికి బాలకులెల్లరు తానుచెప్పు పాఠములు చదువ నిరాకరించి ప్రహ్లాదునితో హరిభజన జేయబూనినారనీ ప్రహ్లాదుని భక్తికి ప్రతిక్రియ ఆలోచించకుండా యింకను ఉపేక్షిస్తే మనదానవ సామ్రాజ్యమంతా విష్ణుభక్తుల మయమైపోగలదనీ చెప్పినాడు.

లీ: అందుకని?

హి: ప్రహ్లాదుని వధించక తప్పదు.




లీ: అయ్యో!అయ్యో! ప్రహ్లాదా! ప్రహ్లాదా!(అంటూ లీలావతి మూర్ఛాక్రాంతురాలై పడిపోవును.)

హి: కొమారునివధా వృత్తాంతము వినగానే లీలావతి మూర్ఛపోయినది. ఏమిచేయను ముందుగొయ్యి వెనుకనుయ్యిగ నున్నది. (అని లీలావతిని చల్లని నీళ్లతో కన్నులు తుడిచి మూర్ఛదేర్చును)

లీ: నాథా! ప్రహ్లాదుడు! ప్రహ్లాదుడు!

హి: దేవీ! దేవాసురులకు అనేకయుగాలుగా పోరు సాగుతున్నది. ఈపోరాటంలో అనేకపర్యాయములు మనమేగెల్చి దేవతలను పారద్రోలితిమి; వారి ఆధిపత్యములు కైవసంచేసుకొని పశుబలంయొక్క పటిష్ఠతను నిరూపించితిమి. అయినా ఈసమయములలో కపటీ, మోసగాడు అయిన విష్ణువు ఏదో మాయోపాయంచేత దానవులను వంచించి వేల్పులను రక్షిస్తున్నాడు. ప్రకృతి సహజమైన యీసృష్టికి ఒకనేత ఉన్నాడనీ, అతడే దైవమనీ, ఆదైవం తానేననీ, ఈసమస్త బ్రహ్మాండములు తనసంకల్పంచేత తనయందే పుట్టుచున్నవనీ, తనవల్లనే వృద్ధిపొందుచున్నవనీ, తనయందేలయించుచున్నవనీ, కాన జగములన్నీ తన్నేకొలువ వలెననీ వానిమతము. సహజసిద్ధమైన సృష్టికి వీడుమూలాధారమైన పురుషుడట! దేవుడట! ఇట్టి అనృతములు కల్పించి, పురుషకారమున

వీనిని ధిక్కరించు మనలను ప్రతిఘటిస్తూ దనుజ మర్దనుడనీ, దైత్యాంతకుడనీ, మురారి అనీ, మధుసూదనుడనీ, మనకు అవమానకరంగా పేర్లుపెట్టుకొని కులుకుతున్నాడు. ఇట్లున్నను, మనదానవ సామ్రాజ్యములో వానిపేరు తలపెట్టినవాడేలేడు. కాని నేడు నా రాజ్యములో నాకడుపున బుట్టిన కొమారుడే నాకు గర్భశత్రువైన ఆనారాయణుని భక్తిజేస్తూ మనదానవ సామ్రాజ్య మందంతటను వైష్ణవ మతమును వ్యాపింప జేస్తూ ఉండగా ఎట్లుసహించగలను ?

లీ: నాథా! మీరుచెప్పినవన్నీ నిజమే గాని పసివాడు గదా! కన్నబిడ్డగదా! దయయుంచి కొంచెం క్షమించరాదా! (కాళ్లపైబడి ఏడుస్తుంది.)

హి: (కండ్లనీళ్లు పెట్టుకుంటూ) దేవీ నాకుమాత్రం కడుపు తీపిలేదా? అపరంజి కాంతులుజిమ్మే ఆసుకుమార దేహము, వికసించిన గులాబులవంటి ఆపాలబుగ్గలు, చిరునవ్వులు చిందే ఆకెమ్మోవి కలకలలాడే ఆ కన్నులు, చిగురుటాకులవంటి ఆచేతులు, ఆనడకలు, ఆహొయలు, ఆసౌమ్యత, ఆచక్కదనము, ఆముఖవర్చస్సు, మనరక్షోకుమారులలో ఎవరికున్నవని? ఆసుకుమార సుందర కిశోర చక్రవర్తిని నిశిత చంద్రహాసానికి ఎరసేయలేక నే గదా ఈరేయి యిట్లా వేగిస్తున్నాను.

లీ: అయితే కడపటిమాట ఏమంటారు? మతి కొంతకా......

హి: (దుడుకుగా) లీలావతి నన్ను బాధపెట్టకు. రాజధర్మం ప్రభువుకొకటీ ప్రజలకొకటీగాదు. రాజవిద్రోహి అయినప్పుడు పుత్రుడైనా శిక్షార్హుడే. పెనిమిటో, కొమారుడో, ఎవరో ఒకరుమాత్రమే నిలువవలెనది. ఇరువురూ ఉండటం అసంభవం. ఇదే అంత్యనిర్ణయం. (అని ముఖముపై గుడ్డపెట్టుకొని పోబోతాడు. నాథా! నాథా అనిదుఃఖిస్తూ లీలావతి అతనిని వెంబడిస్తుంది.) (తెర)

(సశేషము)

# మదనపల్లె మహిళా సమాజము

## 7 - వ వార్షికోత్సవము

మదనపల్లె మహిళాసమాజమువారు తమ 7 వ, వార్షికోత్సవమును 31-7-49 నాడు హోఫుహాలునందు జరిపిరి. సభకు మదరాసునుండి వచ్చినటువంటి ఆంధ్రరాష్ట్రమహిళాసభ కార్యదర్శియగు శ్రీమతి. పద్మాసనమ్మగారు. బి. ఎ. అధ్యక్షతవహించిరి. సమాజపుఅధ్యక్షురాలు శ్రీమతి. క. సుందరాబాయిగారు సభికులకు పద్మాసనమ్మగారిని పరిచయముచేసిరి. సమాజపుకార్యదర్శి శ్రీమతి. వి. గౌరీదేవి గతసంవత్సరపు నివేదికనుచదివిరి.

### అధ్యక్షురాలిఉపన్యాసము

'మదనపల్లెలో శ్రీమతి కజిన్స్ సతీమణిచే ప్రారంభింపబడినసభయే అఖిలభారత మహిళాసభ ఐనది. ఆమె సభకుచేసినసేవ అపారము. ఆమె భారతస్త్రీలకర్తవ్యమును హెచ్చరించెను. ఆమె చేసినసేవ నేడు భారతమాత గర్వించదగిన విషయము. మదరాసుప్రభుత్వ మంత్రివర్గమునందు స్త్రీలకుస్థానము లేకపోవుట అతిశోచనీయము. ఇతర దేశములయందు మనదేశపుస్త్రీలు తమచాకచక్యమునుచూపి గౌరవస్థానమును పొందినారు. మహాత్మాగాంధీగారి ఆదేశానుసారము శాంతము, సహనము. విశ్వమానవప్రేమ నేర్చుకొనవలెను' మొదలగు మహత్తరవిషయములను ఉపన్యసించిరి. మరియు "ఈసమాజము ఇచ్చటి హిందీ చరఖా తరగతులు ముమ్మ్రందు ఇంకనూఅభివృద్ధికి రావలెనని నాఆశయము" అనిరి.

తరువాత సమాజపు విద్యార్థినులచే హిందీ మరి తెనుగునాటకములు ప్రదర్శింపబడెను. చిన్నబాలికలచే గానము, నాట్యము ప్రదర్శింపబడెను. బాలికలకు అధ్యక్షురాలు బహుమతులు పంచినతరువాత "జనగణ" మంగళగానముతో సభముగిసెను.

పైసమాజమువారు తమకొక భవననిర్మాణసహాయార్థమై చిత్తూరి శ్రీనాగయ్యగారి యాజమాన్యమున సుప్రసిద్ధ సినిమాతారయగు శ్రీమతి. టం. సూర్యకుమారి సంగీతకచ్చేరి నాడేజరిపిరి.

### శ్రీనాగయ్యగారి ఉపన్యాసము

ఇటువంటి మహిళాసంస్థలే భావిభారతభాగ్యమునకు వన్నెదెచ్చును. ఇటువంటి మహిళాసంస్థలను ప్రతియొక్క భారతీయుడూ ఆదరించి తగినసహాయమునూ, ప్రోత్సాహమునూ ఇవ్వవలెను.



కుడిప్రక్కన టి. సూర్యకుమారి, చిత్తూరు నాగయ్యగారు.

సమాజమువారు శ్రీమతి. సూర్యకుమారికి శ్రీత్యాగరాజస్వామి రజితపతకమును పారితోషికముగా సమర్పించిరి. భవననిర్మాణకమిటికి అధ్యక్షురాలగు శ్రీమతి. మిసెస్. జార్జిగారు ధన్యవాదములనర్పిస్తూ మదనపల్లె మహిళాసమాజమునకు ఇటువంటి శుభముగూర్చినందులకు శ్రీమతి. సూర్యకుమారిగారికిన్ని సభాధ్యక్షతవహించి కార్యక్రమమును జయప్రదముగా నెరవేర్చినందులకు శ్రీనాగయ్యగారికిన్ని వందనములుపలికిరి,

శ్రీమతి. టం. సూర్యకుమారిగారి "జనగణమన" మంగళగానముతో నాటిసభముగిసెను.

## ఆంధ్రరాష్ట్ర మహిళాసభ శాఖ. మదనపల్లె

మదనపల్లె మహిళాసమాజమువారు శ్రీమతి సౌభాగ్యమ్మగారి అధ్యక్షతక్రింద నూతన కార్యనిర్వాహకులను ఎన్నుకొనిరి.

అధ్యక్షురాలు:- శ్రీమతి. కె. సుందరాబాయిగారు.
ఉపాధ్యక్షురాలు:- శ్రీమతి. ఆర్. అమృతమ్మగారు.
కార్యదర్శి:- శ్రీమతి. వి. గౌరీదేవి.
సహాయకార్యదర్శి:- శ్రీమతి. శాంతాదేవిగారు.
ట్రెజరరు:- శ్రీమతి. ఆర్. సుబ్బలక్ష్మమ్మగారు.

కార్యనిర్వాహకులు:- (1) శ్రీమతి. జె. శారదాంబాగారు. (2) శ్రీమతి. జి. వెంకటమ్మగారు (3) శ్రీమతి. బి. కనకమ్మగారు. (4) శ్రీమతి. సౌభాగ్యమ్మగారు. (5) శ్రీమతి. చెల్లమ్మగారు. (6) శ్రీమతి. కె. విశాలాక్షమ్మగారు. (7) శ్రీమతి. సలీమ. సుల్తాన్.

# మనసుకలత

శ్రీమతి గుడిపాటి వెంకట సుబ్బమ్మగారు

(గతసంచిక తరువాయి)

వారం గిర్రున తిరిగివచ్చింది. మూర్తిగారిదగ్గర నుంచి రేపుప్రొద్దున్నే మెడ్రాసులో దిగుతామని వుత్తరంవచ్చింది.

సరే ఆమరునాడు మూర్తిగారు, కమల దిగారు. కమలని వెయిటింగురూములోనే వదిలేసి తనసామానులతో యిల్లుచేరారు మూర్తిగారు. భార్యాబిడ్డల క్షేమసమాచారాలుమాత్రం కనుక్కొని స్నానంచేసి బట్టలుమార్చుకున్నారు. వంటఆవిడ వున్నా ఆరోజుఫలహారం సుసీలాంబ స్వంతంగా తయారుచేసింది. ఎన్నాళ్లనుంచో హోటల్లోతినివున్నారు భర్తఅని. రుచినాగ్రహించకుండా తొందరగా కాఫీ ఫలహారం ముగించుకుని, "పనుంది సుసీ, వెళ్లాలి. త్వరగావంటచేయించు. రాగానే భోజనంచేసి ఆఫీసుకువెళ్లాలి" అనిమాత్రంచెప్పి వెళ్లిపోయారు. మూర్తిగారు మామూలుగా లేరు. కమలని యింటికితెస్తే ఎదోఒకప్రక్క వుండి గడుపుకునేమనిషి కాదు. ఇల్లాచనువుగా తిరుగుతే సుసీలాంబకి కష్టంగావుంటుందేమో. సుసీలని కలతపెట్టడం తనవుద్దేశంకాదు. ప్రస్తుతం హోటల్లో ఒకగదిలోపెట్టారు కమలని. నిమ్మళంగా యేఆడపిల్లలస్కూలు టీచరుగానోవేయించి తరవాత ఆమెకితగిన కుర్రాడినివెతికి పెళ్లిచెయ్యాలని మూర్తిగారివుద్దేశం. ఇంతపని తలమీద బరువుగా వుండగా మామూలు తేలిగ్గాను సంతోషంగాను ఎల్లాగుండగలరు మూర్తిగారు. ఏదోకొంపమునిగి మూర్తిగారికి తనమీదప్రేమతగ్గిందని సుసీలాంబ అనుమానం. ఇల్లా కాలప్రవాహంలో ఒకవారం గడిచింది. సాయంకాలం కాఫీతీసుకుంటో తను రాత్రిప్రొద్దుపోయేదాకారాననీ తనకోసం ఎవరూ కనిపెట్టుకుని కూర్చోవద్దనిచెప్పి వెళ్లారుమూర్తిగారు. కమల సినీమాకివెడదామని బలవంతపెట్టడంవల్ల యిద్దరుకలిసి సినీమాకు వెళ్లారు. వచ్చేటప్పటికి రాత్రి 12 గంటలయింది. ప్రొద్దుపోవడంవల్ల బస్సు దొరక్క ఆరాత్రి కమలగదిలోనే వుండవలసి వచ్చింది మూర్తిగారికి. వేరేకేంపుకాటు వేసింది కమల. యిద్దరు కబుర్లుచెప్పుకుంటూ పడుకున్నారు. "ఎంతప్రయత్నంచేసినా నీకోసం యింతవరకూ ఏ ఏర్పాటుచెయ్యలేకపోయాను కమలా. ఏదోచిన్ననౌకరీ కుదిర్చి తరువాత నీకుతగ్గ వరుణ్ణిచూసి నిన్ను అప్పగించానంటే నాబాధ్యత పూర్తిగావొదిలిపోతుందని" అన్నారు మూర్తిగారు మాటవరుసగా. ఆ మాట కమలకి కష్టంఅనిపించింది. మీకష్టంనాకుతెల్సుగాని, నన్నుఎవరికోయిచ్చి పెళ్లిచెయ్యడానికి ప్రయత్నిస్తున్నారని నేనుఅనుకోలేదు. నామనస్సు మీరుగ్రహించారని యిన్నాళ్లనుంచి అనుకున్నాను. నేను మిమ్మల్నితప్ప యింకెవరిని చేసుకో తలచుకోలేదు" అని స్పష్టంగాచెప్పింది కమల. కమలయిల్లా కోరుతుందని మూర్తిగారు ఎప్పుడుఅనుకోలేదు. "కమలా నాకు వివాహం అయిందని నీకుతెలుసుకదా? ఇల్లాకోరడం ధర్మమా? నీకోసం నేనుఒప్పుకున్నా సుసీల వప్పుకుంటుందా? నేను నీపనిలోమునిగి మాట్లాడానికేనా సమయం దొరక్క సరిగ్గామాట్లాడటంలేదని ఆమెఎంతోకుంగిపోతోంది. భార్యవుండగా సంతానంవుండీకూడా యింకొకజాతిస్త్రీని చేసుకుంటే సంఘం వప్పుకుంటుందా? భగవంతుడువప్పుతాడా? చదువుకున్నదానవు ఆలోచించుకమలా" అని తడుముకోకుండా మూర్తిగారు అంటూంటే కమలకి ఏడుపుఆగింది కాదు. గోడవేపుతిరిగి వెక్కివెక్కి ఏడవడం మొదలెట్టింది. మూర్తిగారు చూడలేకపోయారు.

కమలమంచందగ్గిరకివచ్చి "కమలా ఏడుస్తున్నావా? ఛా! ఇటు చూడూ" అన్నారు. కమలకొంతసేపటికి తెప్పిరిల్లి కళ్లుతుడుచుకుని మూర్తిగారికళ్లల్లోకి దీనంగాచూస్తూఅంది "రెండుపెళ్లిళ్లుచేసుకున్నవాళ్లు ఎందరులేరు. గొప్పవాళ్లలోనూ కొద్దివాళ్లలోనూ కూడావున్నారు. దేముడుమెచ్చుకోడా? దేముడు మెచ్చుకోపోవడానికి ఏంద్రోహంవుంది. మీభార్యని వదిలెయ్యమన్నానా? సంఘమా! మనముగురికీయిష్టమయ్యాక సంఘంతో మనకేమిపని. పోనియ్యండి భగవంతునికి నేనిలావుండడమేయిష్టమేమో. కాని మీభార్యతోను మీమనసుతోను బాగాఆలోచించుకోండి. ఇకనావివాహప్రయత్నం చెయ్యకండి. ఆడదానికిఒక్కడేభర్త. నేనుయిలా బ్రహ్మచారిణి గానే వుండతలిచాను. గరల్ స్కూలులో హౌస్ టీచరు కావాలనితెలిసింది. రేపువెళ్లికనుక్కుంటాను. కొద్దిరోజుల్లో అందులోచేరి బాలికలసేవలో నాజీవితంముగించడం శ్రేయస్కరం అని చూస్తున్నాను" అని యింకాయేమేమో అంది కమల. మూర్తిగారు వింటూనేవున్నారు కాని మనస్సు యిక్కడలేదు. ఆయనకే తెలియని ఆలోచనలోపడింది. చివరకిఎల్లాగో నిద్రలేకుండానే తెల్లార్చారు. "మళ్లీసాయింకాలంవస్తా కమలా" అని శలవుతీసుకుని మూర్తిగారు యింటికెళ్లేటప్పటికి 8 గంటలుదాటింది ఉదయం. సుసీలాంబ యింకా కాఫీతీసుకోలేదు. రాత్రిపొద్దుపోయేదాకరానంటే యేమిటింకోవుందనుకుందిపాపం. తెల్లారియింతసేపటిదాకా భర్తరాకపోవడంవల్ల మతిలేదు. యివాళ యేమయినాసరే అడగాలనిఅనుకుంది. యిద్దరూ కాఫీ, ఫలహారాలకికూర్చున్నారు. మూర్తిగారు సుసీలమ్మనిచూశారు. చిన్నపోయివుంది. "ఏం, సుసీలా, ఇంకానువ్వుకాఫీ తీసుకోలేదు. అల్లావున్నావేం? ఎల్లాగైనానువ్వు అదోకలావుంటున్నావు. ఎందుకోచెప్పు." అనేటప్పటికి అప్పటిదాకా కష్టపడిఆపుచేస్తూన్నదుఃఖం పొంగివచ్చి కళ్లవెంట జలజలానీళ్లురాల్చడం మొదలెట్టింది. మూర్తిగారు సుసీలాంబదగ్గిర కూర్చుని కళ్లుతుడుస్తూ "వూరుకో సుసీలా! ఏదో మనస్సులో పెట్టుకుని అనవసరంగా కలతపడతావు" అన్నారు. "అదోకలావుంట నేనా మీరా?" అని మాత్రం అందిసుసీల. మూర్తిగారు సుసీలతలనిమురుతో "రాత్రిరానందుకే నానీకోపం. నువ్వుఅల్లరిచేస్తావని నేననుకుంటూనేవున్నా" నన్నారు నవ్వుతో.

సమాప్తము.

# సంపాదకీయములు

## దారుణ మారణ సాధనము

యుద్ధమన్నతర్వాత క్రౌర్యముదానినంటే ఉంటుంది. అనేకనియమనిషేధాలలో ప్రారంభమైన భారతయుద్ధంలోనే ఎన్నోఘోరాలుజరిగాయి. అంతకుముందు చెప్పనేఅక్కరలేదు. మానవజాతి ఏదో ముందుకు సాగిపోయిందనే 20 వ శతాబ్దమధ్యంలోను నవనవలాడేపట్నాలను నాశనంచేసిన అటంబాంబులుపయోగించడంచూచాము. కొంతకాలంక్రిందటనే మహామారణకసాధనం కనిపెట్టారట. ఆపదార్థం 7 ఔన్సులు ( 6 పలాలుకూడా ఉండదు ) గలబాంబులుచాలునట, మానవజాతినంతా తుడిచిపెట్టివేయడానికి. అందులోనుంచి రోగక్రిములుబయలుదేరి ప్రపంచమంతా ఇంతలోవ్యాపించి మానవజాతిని విరుచుకొని తింటాయి. ఏదోచిన్న పురుగుకదా, గ్రామాలందంతటా విశేషంగావ్యాపించిన నాగజెముడును ఊరుపేరు లేకుండాచేసింది. ఈదారుణమారణసాధనమునుగూర్చి విన్నతర్వాత మానవజాతి పురోవృద్ధిచెందుతున్నదా క్షీణదశకువచ్చుచున్నదా యన్న అనుమానముదయించకపోదు. బహుశా ఈయుగప్రళయమును ఈశ్వరుడీవిధముగా నిర్ణయించెనేమొ ?

## మద్రాసులో 31 వ శిశుసంరక్షక కేంద్రము

శిశుసంరక్షకకేంద్రాలు నాగరికప్రభుత్వానికి శుభలక్షణాలు. మద్రాసుకార్పొరేషన్ వారీ విషయమై కృషిచేయడం ప్రశంసార్హము. తాళ్లపప్పమనేచోట ఈమాసారంభంలో క్రొత్తకేంద్రాన్ని తెరిచారు. దానిపేరునుపట్టి ఇదిపేదసాదలుండేచోటని తెలుస్తున్నది. వీరికిదిబాగా ఉపయోగపడునని ఆశిస్తున్నాము. వారున్నూ దీనినర్హరీతిని ఉపయోగించుకోవాలని కోరుతున్నాము. వారిలోతగుప్రబోధము జరిగినగాని ఆపనిజరుగదు. ఈకార్యక్రమము ప్రజాసేవకులమని ఓట్లకెగబడేవారు తప్పకపూనవలసినది. ఈకేంద్రానికి సంవత్సరమునకు రు 1000 లు ఖర్చుఅగునని కమిషనర్ శ్రీ నరసింహంగారు అంచనావేయుచున్నారు. నిజముగానిది చాలస్వల్పమొత్తము. రోజుకు రు 1.0.0 కులోపే అగుచున్నది. కావున ఆయనవిరివిగా వదాన్యులు విరాళాలివ్వండి అనికోరినారు. కార్పొరేషన్ వారు 31 కేంద్రాలు నిర్వహిస్తున్నారంటే నగరవాసులెంతగా వీనిని ఆదుకొనవలెనో చెప్పనక్కరలేదు. శిశువులయెడ దయాహృదయులైనవారికెల్ల అవశ్యకర్తవ్యము.

## బస్సుగైడు

మద్రాసులో బస్సులు ప్రభుత్వపరమైనవాటినుండీ అనేకవిధముల ఉత్తరువులు పుట్టియున్నవి. పూర్తివివరములు ప్రయాణీకులకు తెలియక తికమకపడుచున్నారు. కండక్టర్లునేడు ప్రభుత్వపునౌకర్లగనుక అజ్ఞానులగుప్రయాణీకుల ప్రశ్నలకు జవాబుచెప్పవలసిన అగత్యములేనివారమని భావించుచున్నారు. ఇట్టి సందర్భమున ప్రయాణీకుల సౌకర్యార్థమై ప్రభుత్వమువారొక బస్సుగైడును ప్రచురించిరనివినుటకు సంతసించుచున్నాము. ధరయు 0.2.0 లు మాత్రమేయుంచుట న్యాయమైనది. అయితే దీనినిఆంగ్లములోనే ప్రచురించినట్లు తోచుచున్నది. కాని ప్రయాణీకులందరు ఆంగ్లవిద్యావేత్తలు కారు. దేశభాషలలో అనగా మద్రాసునకైన తమిళము, తెలుగు, కన్నడ, మరాటీ, గుజరాతీ, హిందీ, మళయాళభాషలలో ప్రచురింపదగును. అదియే పూర్వమునుంచి ఈనగరమున ఆచారము. అప్పుడే ఈగైడువల్ల స్త్రీలుసహా లాభము పొందగలరు.




సందేశం : సంపాదకులు శ్రీ పి. గోపాలరావుగారు. కార్యాలయం నెం 34 ఆచారప్పన్ వీధి, మద్రాసు 1. 16 పు. వెల పావలా.

కమ్యూనిస్టు పార్టీవారిదిగా కనిపిస్తున్నదీ క్రొత్త పత్రిక. ప్రథమ పత్రికలో వీరు అరవిందఘోషుపై ధ్వజమెత్తారు. కాంగ్రెసును, సోషలిస్టు పక్షాన్నికూడా వీరు తీవ్రంగా విమర్శిస్తున్నారు. విమర్శన ప్రజాయుగంలో అవసరమే గాని ఇందు చేయబడ్డవన్నీ విమర్శనలనిపించుకోవు. అదియొక పంథా.

(రా. వెం.)

చిన్నమాంబాంధ్ర ముద్రాలేఖిని పుష్కరసంచిక, ఆ. వెం. శాస్త్రిగారు 1/1 వీరకోయిల్ వీధి; వేలపాడి వెల్లూరు. నా. ఆ

శ్రీ శ్రీ శ్రీ పీఠికాపురం మహారాజావారి ద్వితీయ పుత్రులు శ్రీ రాజా వేంకటమహీపతి సూర్యారావు బహద్దూర్ వారు 12 సం॥ల క్రిందట తెలుగు టైపురైటరు నొక్కదానిని కనిపెట్టి దానిని అమలులోనికి తెచ్చిరి. 12 సం॥ లైనను ఇంకను అది బాగుగా వ్యాప్తిచెందలేదు. దాని ప్రకటనార్థం శ్రీ ఆకుండి వెంకటశాస్త్రిగారొనర్చిన ఒకానొక చమత్కారం ఈ చిన్నగ్రంథం. వ్యాపారానికిట్టి ఉపాయాలు అవసరమే. అందుకు దేశానికి భావను ఉపయుక్తమైన సాధనము టైపురైటరు. పూర్వము "వ్రాతప్రతి"కి ఎంతో విలువ. గొప్పరచయితల వ్రాతపతులు నిలువఉంచేవారు. టైపువచ్చిన తర్వాత వ్రాతప్రతులు మృగ్యమైనాయి. అలాభాషాచరిత్రలో దేశచరిత్రలో మార్పుతెచ్చినదీయంత్రం. ఈ యంత్రం బాగా వాడుకలోకివస్తే ఆంధ్రభాషాభివృద్ధి అనేక విధాల జరగడానికవకాశం ఉంటుంది. అయితే ఇది కేవలం 'ఆంధ్రాభిమానం'తో చేకూరదు. శ్రీ వేంకటశాస్త్రిగారివంటి ఉపాయశాలికితోడు యాంత్రిక శాస్త్రజ్ఞుడుకూడా చేరి దీనిలో లోట్లుతొలిగించను నిరంతము కృషిచేస్తుంటే దీనికి గిరాకీ హెచ్చగలదు.

సారస్వత పుష్పమంజరి సంపాదకులు : ఆకుండి వెంకట శాస్త్రిగారు నెం. 1. వీరకోయిల్ వీధి వేలప్పాడి. వెల్లూరు. నా. ఆ.

ఇది సంవత్సరానికి మూడుసార్లు ప్రకటింపబడే అపూర్వమైన పత్రిక. ఖండకావ్యముల సంపుటి. ఇందలి ముఖ్యకావ్యము శ్రీగరిమెళ్ల సత్యనారాయణగారి బొబ్బిలిపాట. అందలి ఇతివృత్తము చిరకాలము క్రిందట శ్రీఆకుండి వ్యాసమూర్తి శాస్త్రిగారిచే వ్రాయబడిన భారతము ఇంకను పునర్ముద్రణము గాంచలేదని ఆంధ్రులను హెచ్చరిస్తూ కొద్దిగా చీవాట్లు.

ఉత్తరాంధ్ర : స్వాతంత్ర్య దినసంచిక. సంపాదకుడు శ్రీజి వి. రమణ మూర్తి గారు. శ్రీ కాకుళం విశాఖపట్నంజిల్లా. విడి ప్రతి రు. 0-4-0

అన్ని స్వాతంత్ర్య సంచికలవలెనే అందంగా తయారైంది ఈ సంచిక. ఈ పత్రిక సామాన్యంగా 'రాజకీయబాధితుల' కొరకై తంటాలు పడుతుంటుంది. పాపం! వీళ్లకీబాధ ఎప్పుడు తొలగుతుందో?

**యదుకుమార్ : శ్రీ కృష్ణజయంతి సంచిక. కార్యాలయం తెనాలి. ప్రతి 1 కి రు. 0-6-0 లు.**

ఆంధ్రదేశమందలి వివిధకులస్థులలోవలెనే యాదవులలోనూ అంకురించిన కులాభిమానమును పురస్కరించుకొని ఉదయించినదీ పత్రిక. తొలుత కార్యాలయం గుడివాడ; సంపాదకులు శ్రీ లోయ లక్ష్మీపెరుమాళ్లుగారు. ప్రస్తుతం కార్యాలయం తెనాలికి మార్చబడినది. సంపాదకులుకూడా మారినారు; శ్రీ చావలి బసవోజీగారు ప్రస్తుత సంపాదకులు. ఈ మార్పునకై 6 నెలలనుండి పత్రిక వెలువడక నిల్చియుండెను. శ్రీ కృష్ణావతారమును 'గొల్లకృష్ణు' డంటారు. అందుచేత యాదవులు కృష్ణుని తమ వానిగా ఎంచుకోవడంకలదు. కాబట్టి శ్రీ కృష్ణజయంతి సంచికగా తెనాలిలో పునఃప్రారంభము జరిగినది. శ్రీ కృష్ణుని దయవల్ల ఈ పత్రికయు ఈ పత్రికసేవించు యాదవులును అభివృద్ధిగాంతురుగాక.

**'రూపా' తలవెంట్రుకల తైలం.**

“ అరవింద లేబొరేటరీస్ ” వారు తయారు చేయించి విక్రయమున కుంచిన “రూపాతల వెంట్రుకల తైలం” సీసాను పరిచయార్థం మా కార్యాలయాని కంపారు. తైలం వెగటుగల్గించని మృదువైన సువాసన గల్గియున్నది. తలకురాచుకున్న తర్వాత చాలాకాలం ఆ సువాసన అట్లాగే ఉండడంచేత అందులో వేసినమూలికల బాపతే ఈవాసన అనిపించింది. కొద్దికాలమే ఉపయోగించినా, తలకుచల్లదనమిచ్చి హితవుగా నుండుననిపించింది. ఇందుఅనేకమైన ఆయుర్వేద మూలికలనే వాడినాము అంటున్నారు. మార్కెట్టులోగల అనేకమైన చౌకరకపు తైలాలతో పోల్చిచూస్తే దీనిని లక్షణాలనుబట్టి వీరిని కాదనరాదనిపించును. స్త్రీపురుషులు కొనివాడి పరీక్షింప దగినది. దీనికమర్చిన అట్టపెట్టెకూడ ఆకర్షణీయంగా ఉన్నది. ఒకభాగ్యశాలి ఈ తైలంచేత నిడుపుగా, హెచ్చుగా, నిగనిగలాడుతూ పెరిగిన జుట్టును ముడివేసుకోడానికి చేతికరపక విరియబోసుకొని కులాసాగా ఉయ్యాలూగుతూ ఆనందం అనుభవిస్తున్నట్టున్నది పైబొమ్మ. ధరకూడా ఎక్కువకాదు. సీసా రు 1-8-0 మాత్రమే.

దీనికి సోల్ డిస్ట్రిబ్యూటర్లు పుష్పవనం స్టోర్సు, తిరువళ్ళిక్కేణి. మదరాసు, 5.

## శ్రీ విరోధినామ సంllర భాద్రపద, ఆశ్వీయుజమాసములు.

| | తేదీ | వారం | |
|---|---|---|---|
| | 16 | శు | న 53-26 మృ 1-4 దివ 22.38. |
| | 17 | శ | ద 51.50 ఆర్ద్ర 2.13 రావి 1.53. |
| | 18 | ఆ | ఏ 49-2 పున 2-10 దివ 21.47 సర్వేషామేకాదశి. |
| | 19 | సో | ద్వా 45-23 పుష్య 1-1 ఆశ్రే 57-53 రావి 1-39 యతిమహాలయం. |
| సెప్టెంబరు నెల | 20 | మం | త్ర 40-50 మ 55-55 దివ 27.24. |
| | 21 | బు | చ 35-36 పూఫ 52.29 సా 19.38. |
| | 22 | గు | ● 29-53 ఉ. ఫ 48.31 దివ 9-18 మహాలయమావాస్య. |
| | | | **ఆశ్వీయుజమాసము** [చంద్రోదయం |
| | 23 | శు | పాడ్యమి 23-53 హ 44-24 దివ 8-5 శరన్నవరాత్ర ప్రారంభం. కలశస్థాపనం |
| | 24 | శ | వి 17-47 చి 40.16 దివ 3.1 రావి 23-18 తిథిద్వయం. |
| | 25 | ఆ | త 11-49 స్వా 36-14 రావి 19-24 తులాయనం. చతుర్థితిథిః. |
| | 26 | సో | చ 6-10 విశా 32.41 వి 34.29 రావి 12-13 ఉపాంగలలితావ్రతం. |
| | 27 | మం | పం 1-2 షష్ఠి 55-34 అనూ 29.42 రావి 3-15 యమకంటకయోగం. |
| 1949-వ సంll | 28 | బు | స 53-3 జ్యే 27.30 ఆయం 21-42 త్యా పూ వి శా. 2 శుక్రః. [అనధ్యాయః. |
| | 29 | గు | అ 50-31 మూ 26-15 దివ 22-20 రావి 20-19 సరస్వతిపూజా దుర్గాష్టమి, |
| | 30 | శు | న 49-6 పూషా 26-5 రావి 16 37 దుర్గాబలిః మహానవమీ. సువాసినీపూజా. |
| | 1 | శ | ద 48-59 ఉషా 27-6 రావి 7-43 విజయదశమీ. శమీపూజా. |
| | 2 | ఆ | ఏ 50-8 శ్ర 29 22 రావి 10-17 సర్వేషామేకాదశి. |
| | 3 | సో | ద్వా 52.31 ధ 32-50 రావి 22-33 గోద్వాదశీవ్రతం. |
| | 4 | మం | త్ర 56-4 శత 37-30 రావి 25-29. |
| | 5 | బు | చ 60-0 పూభా 43. 5 |
| అక్టోబరు నెల | 6 | గు | చతు 0-31 ఉభా 49-19 వృ 4.51 దివ 9 35 కౌముదీపూర్ణిమా. చంద్రదర్శనం. |
| | 7 | శు | ○ 5-23 రే 55.51 దివ 22.35. |
| | 8 | శ | పాడ్యమి 10.50 అశ్విని 60.0 రావి 21.38. |
| | 9 | ఆ | వి 15-49 అశ్వి 2.12 దివ 28-32 తృతీయాతిథిః. (అట్లతద్ది) |
| | 10 | సో | త 20-10 భ 8-2 20-10 రావి 11-7 శూన్యతిథిః |
| | 11 | మం | చ 23.33 కృ 13.0 రావి 26-14 భౌమ చతుర్థి యమకంటకయోగః. |
| | 12 | బు | పం 25-40 రో 16-54 రావి 2-10. |
| | 13 | గు | ష 26-49 మృ 19-33 రావి 11-45. |
| | 14 | శు | స 20-33 ఆర్ద్ర 20-59 రావి 21.50. |
| | 15 | శ | అ 25-1 పున 21.12 రాః 11-41 అనధ్యాయః. |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.

REGD. NO. M. 4793

*An ideal Combination of Beauty-Aids!*









రాజా
స్నో
హేరాయిల్
కస్తూరిసోప్పు
బ్రిలియన్‌టైన్







MANYAM & CO., Bangalore – Madras
Madura – Bombay.